TANJORE SARASWATHI MAHAL SERIES 15.

# VIPRANARAYANA CHARITRA

(A YAKSHAGANA)

By

**VIJAYARAGHAVANAYAKA,**

Critically Edited

BY

**Sri V. SUNDARA SARMA,**

Pandit, Saraswathi Mahal Library, Tanjore;

and

**Sri A. MAHADEVA SASTRI,**

Pandit, Saraswathi Mahal Library, Tanjore.

PUBLISHED BY

**Sri S. GOPALAN, BA., BL.,**

*Hon: Secretary,*

for the Administrative Committee,

T. M. S. S. M. Library, Tanjore.

**1950.**

**Price: Rs. 1-4-0.**

తంజావూరు సరస్వతీ మహల్ ప్రచురణము 15.

# విప్రనారాయణ చరిత్ర

( యక్షగానము )

## విజయరాఘవనాయక విరచితము.

పరిష్కర్తలు :

శ్రీ వి. సుందరశర్మ,
పండితుఁడు, సరస్వతీ మహల్ గ్రంథాలయము, తంజావూరు.

శ్రీ అ. మహాదేవశాస్త్రి,
పండితుఁడు, సరస్వతీ మహల్ గ్రంథాలయము, తంజావూరు.

తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయ
నిర్వాహక సంఘార్థమై గౌరవకార్యదర్శియగు
శ్రీ S. గోపాలన్, B.A., B.L., గారిచే
ప్రచురింపఁబడినది.

1959.

మూల్యము : 1—4—0.

# PREFACE.

The present Telugu publication is a Yakshagana or opera mainly intended to be recited by street-bards. The subject is the life of VIPRANARAYANA, one of the 12 Alwars of Vaishnavite cult. He is otherwise called BHAKTANGHRIRENU in sanskrit and TONDARADIPODI ALWAR in Tamil. The author of this work is Vijayaraghavanayaka, the last Nayak King of Tanjore (1633 to 1673 A. D.). He was a great devotee, like his ancestors, of the Vaishnava cult, and was proud to call himself "Mannarudasa" or the servant of Sri Rajagopalaswami, the presiding deity at Mannargudi, about 29 miles south-east of Tanjore. The author, as well as his father Raghunatha Nayaka, was a great patron of learning and arts, in general, and Telugu literature in particular. and they have themselves been great poets and authors of standard works in subjects like music.

Vijayaraghavanayaka has himself given a list of his own Telugu works in one of his Yakshaganas, namely "Prahladacharitramu". The list contains more than 50 works comprising Natakas, Yakshaganas, Dvipadakavyas and translations in Telugu Dvipada metre of famous Sanskrit works like Padukasahasram. Mention must specially be made of his two historical works on the

life of his own father, Raghunatha. One is a Yakshagana called Raghunathabhyudayamu and the other a Dvipada Kavya, called Raghunathanayakabhyudayamu. These two works have been edited and printed and will be issued shortly.

The Yakshagana is a dramatic recitation in songs and prose, developed chiefly in the Andhra country. They are generally sung by hereditary bards to the accompaniment of drums and other musical instruments. For a fuller history of Yakshaganas, the reader is referred to the detailed account of it in the Telugu introduction of the editors of this work.

The traditional version of the life of saint Vipranarayana is as follows:—

The saint devoted his life to the service of Lord Sri Ranganatha, the presiding deity of Sreerangam. He had unfortunately contracted the freindship of a courtezan or dancer of the temple. All the same he had a deep devotion for the Lord Ranganatha. The Lord wanted to wean his devotee from the evil influence of the courtezan and played a grim practical joke with that end in view. One of the golden fonts usually placed before the deity suddenly disappeared, and was traced in the home of the courtezan in question. Evidence was forthcoming that it was handed over to her by somebody calling himself a servant of Vipranarayana. Vipranarayana was therefore accused and brought before the King's tribunal. He was non-plussed and protested his

innocence. But in the face of overwhelming evidence and probabilities, it was of no avail and Vipranarayana was found guilty. But the king was so much struck by the perfectly innocent demeanour of the accused, that he could not make up his mind to trust his own judgment. He therefore deferred pronouncing the sentence and prayed to Sri Ranganatha to throw light on the mystery. That same night the King had a dream in which the Lord appeared before him and told him that it was He that removed the font to the courtezan's house and had taken it back, and that this was done to free his devotee from her clutches.

The King rose from his dream, hurried to the place where Vipranarayana was kept in confinement, ordered his release and fell at his feet and begged his pardon; Vipranarayana however, felt the ignominy of the public exposure of his freindship with the courtezan so much, that thence-forward he turned an ascetic spending all his time in the service of the Lord and in singing his praise. His songs numbering 55 are among the most moving stanzas of the 4,000 Divya Prabandhas in Tamil.

In this Yakshagana, however, the scene of action is changed to Mannargudi and the King before whom he appears is Vijayaraghava himself. This aspect of this version is one of the reasons which makes one pause before ascribing the authorship of this work to Vijayaraghava himself, although the introductory portion of this work attributes it to him.

Other reasons are also given by the learned editors why this work must have been composed by some other person.

Whoever the author may be, the work contains high-class Telugu literature in songs, verses and prose and has therefore been selected for publication.

The work has been very carefully edited with a learned introduction by Sri A. Mahadeva Sastri and Sri V. Sundara Sarma, our Telugu Pandits, to whom our thanks are due.

We are greatly indebted to the Madras Government for their timely grants which have enabled us to publish this and other valuable works of this Library.

T. M. S. S. M. Library,
TANJORE, 1950.

S. GOPALAN,
*Honorary Secretary.*

# ఉపోద్ఘాతము.

## కృతికర్త.

విజయరాఘవనాయకుఁడు తంజాపురాంధ్రనాయకుల చరిత్రలో స్వర్ణాక్షరములతో లిఖింపఁదగిన కీర్తియశోవైభవములుగల మహారాజు. ఆంధ్రనాయకుల యేలుబడిలో నితనికాలము స్వర్ణయుగమై యొప్పెను. ఇతఁడు ప్రసిద్ధుఁడగు రఘునాథనాయకుని కుమారుఁడు. రాజమన్నారు గుడియందలి శ్రీ రాజగోపాలస్వామి యనుగ్రహముచేఁ గలిగిన యీ విజయరాఘవభూపాలునికి "మన్నారుదాసు" అనికూడ మఱియొక పేరు ప్రసిద్ధికెక్కినది. ఇతఁడు శ్రీరాజగోపాలస్వామి భక్తుఁడు. ఇతని యాదరణమున నాంధ్రసారస్వతము సర్వతోముఖాభివృద్ధిఁ జెంది శోభించినది. పట్టలైన కవీశ్వరు లితనికాలములోఁ బెక్కు గ్రంథముల రచించిరి. స్త్రీలుకూడ నితని యాస్థానమున కవయిత్రులై విలసిల్లిరి. "మన్నారుదాసవిలాస" మను విజయరాఘవనాయకుని చరిత్రమును రచియించినది రంగాజమ్మయను స్త్రీరత్నము! ఈమెయే "ఉషాపరిణయ" మను ప్రబంధమునుగూడ రచించినది. విజయరాఘవనాయకుఁడు పదునేడవ శతాబ్దముయొక్క మధ్యకాలములో తంజాపురరాజ్యమును పరిపాలించెను (1633-1673. A. D). ఆ కాలమున నితఁడు చేసిన సారస్వతసేవకు, అప్పటి కవులచే వ్రాయఁబడిన యనేక గ్రంథములును, స్వయముగా నతనిచే వ్రాయఁబడిన గ్రంథములును ప్రబలనిదర్శనము. విజయరాఘవభూపాలుఁడు భక్తుఁడు, వైష్ణవాభిమాని, కవి, కవిజనాశ్రయుఁడు. తనతండ్రియగు రఘునాథనాయకుని చరిత్రమును వర్ణింపుచు "రఘునాథనాయకాభ్యుదయ" మను ద్విపదకావ్యమును, రఘునాథాభ్యుదయ" మను యక్షగానమును రచియించియుండెను. (పై రెండుగ్రంథములను త్వరలో నాంధ్రలోకమునకు వెల్లడిసేయఁగలము.)

—: విజయరాఘవనాయకకృతములగు గ్రంథాంతరములు :—

విజయరాఘవభూపాలవిరచితమైన "ప్రహ్లాదచరిత్ర" మను యక్షగానమున నతఁడు రచించిన గ్రంథములను దెల్పు యీపద్యము ఈరీతిని యున్నది.

సీ॥ శ్రీవాంఛ 'రాజగోపాల'విలాసనా
టకము' సందర్భించు సుకవిపంక్తి
ముఖరోక్తులను 'చెంగమలవల్లి[2] పరిణయం'
బానతిచ్చిన ప్రతిభానిధాన
కోవిదుల్ కొనియాడ 'గోవర్ధనో[3]ద్ధర
ణము' రచించిన కల్పనాధురీణ
'రతిమన్మ[4]థవిలాస'కృతిరాజ మొనరించు
పరగు ప్రాబంధికపట్టభద్ర
భువిని 'రాసక్రీడనవనీత[5]చోరంబు'
హావణించి వెలయు మహానుభావ
వాతురిచే 'పారి[6]జాతాపహరణంబు'
రచన జేసిన మృదువచనధుర్య
ఘనమైన '[7]రుక్మిణీకల్యాణ' మనుకృతి
నిర్వహించిన బుధసార్వభౌమ
పటుప 'రా[8]ధామాధవవివాదము' 'ధ[9]నాభి
రామం' బొనర్చు సర్వజ్ఞతిలక
పాండిత్యమున 'సత్య[10]భామావివాహవ
ర్ణన' యొనర్చిన కవిరాజరాజ
ప్రాజ్ఞులౌనన 'నుషా[11]పరిణయనాటకం'
బమరఁజేసిన శారదావతార
'ద[12]క్షిణద్వారకాస్థలవర్ణనాభాగ'
ముద్ధరించిన సుప్రసిద్ధచరిత

మహిమచే 'కా[13]ళియమర్దనం' బొనరించు
సరిలేని రాజులచక్రవర్తి
ధర 'ర[14]ఘునాథాభ్యుదయము' నాటకముగా
ద్విపదగా రచియించు ధీరవర్య
అల 'మో[15]హినీవిలాసాఖ్యద్విపదకృతి'
నాటకం బొనరించు నలసమాన
అతిపవిత్రంబు '[16]ప్రహ్లాద చరిత్రంబు'
సవరించు ఘనమనీషాధురీణ
హరువున '[17]పూతనాహరణం'బనెడు నాట
కంబొనరించు శృంగారలోల
పను '[18]మంజరీద్విపదప్రబంధము నాట'
కంబుగా పావణించు గానచతుర
"వి[19]ప్రనారాయణ" విద్వత్కథాసంవి
ధానం బొనర్చిన ధీనిధాన
బుధులుమెచ్చ 'సము[20]ద్రమథననాటకరాజ'
మొనరించు భువనమోహనచరిత్ర
లలితమౌ 'కృ[21]ష్ణవిలాసనాటకమణి'
సల్పిన యష్టభాషాధురీణ
ఘనతరంబగు 'పాదు[22]కాసహస్రం' బెల్ల
ద్విపదఁ జేయు కళావతీతనూజ
రసికులు ప్రణుతింపఁ 'ప్ర[23]ణయకలహ' మను
కృతి యొనర్చిన చమత్కృతిధురీణ
అతులితప్రౌఢిచే నల[24]కంసవిజయంబు
ఘటియించు భువనవిఖ్యాతశీల
ఘనమైన [25]జానకీకల్యాణనాటకం
బమరించు పాపదూరాగ్రగణ్య

న[26]పపుణ్యక వ్రతనాటకపై ఖరి
సేకరించిన వాగ్విశేష శేష
శేశిపై [27]గోపికాగీతలు [28]భ్రమరగీ
తలు తెనిగించు నద్యతనభాజ
పరిలేని ఫా[29]ల్గుణోత్సవమెల్ల రగడ చౌ
పదము తొనర్చిన భవ్యచరిత
ఫర [30]రాజగోపాలదండకసందర్భ
వైదర్భి గన్న విద్వత్కవీంద్ర
సారమౌ వీ[31]రశృంగార సాంగత్యంబు
మెరయించు రసికుల మేలుబంతి
[32]సంపగిన్నె మన్నారు సాంగత్యము నమర్చి
జగతి నెచ్చిన నెరజాణరాయ
గోపాలునకు వే[33]డుకోలువిన్నపములు
దరువు లొనర్చు నౌదార్యధుర్య
[34]యేలలు వి[35]డిపదాల్ హెచ్చు సం[36]కీర్తనలు
లధ్యాత్మ లొనరించు సతులచర్య
వా[37]ల్చిచి గు[38]జ్జరి వి[39]ల్వేడు దిం[40]డులా
స్యము కంతుకక్రీడ యల్లికయును
కో[45]రవంజి శుభలీల గు[46]జరాతిదేశిచౌ
పదము జ[47]క్కిణి దురుపదము పదస[48]
పదదూత్యమును జో[49]గిపదచాళి శారదా
[50]సామ్రాజ్యమును చిందు సవతిముచ్చ
రంబులు నాట్యకదంబంబు మొదలైన
నాట్యముల్ హవణించు నవరసజ్ఞ

తే॥ మహితగాంభీర్య చోళసామ్రాజ్యధుర్య
కోటిమన్మథరూప సద్గుణకలాప

విక్రమకుమార రఘునాథవిభుకుమార
ధ్రువముగా మను విజయరాఘవనృపాల.

ఈపై పట్టికప్రకారము విజయరాఘవుని లేఖిని సర్వతోముఖముగా నేబది కృతులను సృష్టించినది ; కాని వీనిలో ననేకములు మన దుర్భాగ్యవశముచే దొరుకుట లేదు.

—: కాల విమర్శ :—

1633 న తంజాపురాంధ్రసామ్రాజ్యసింహాసన మధిష్ఠించిన విజయ రాఘవనాయకుఁడు మధురాపురాధీశ్వరుఁడైన చొక్కనాథనాయకునిచే యుద్ధమున 1674 వ సం॥ ప్రాంతమున నిహతుఁడైనట్లు తెలియు చున్నది. అంతటితో తంజాపురాంధ్రసామ్రాజ్య మంతరించెను. కాన నించుమించుగా నీవిప్రనారాయణచరిత్ర గ్రంథముయొక్క రచనాకాలము 1650 A. D. యుండవచ్చునని తోచెడిని. 1676 వ సంవత్సరమున తంజాపురమున మహారాష్ట్రుల పరిపాలన మేర్పడినది.

—: యక్షగానములు :—

గీర్వాణభాషయందలి కావ్యము లిరుదెఱంగుల వెలుంగుచున్నవి. 1. శ్రవ్యకావ్యములు 2. దృశ్యకావ్యములు. అందు శ్రవ్యకావ్యములు కేవలము వినుటచేతనే యానందింపఁదగినవి. దృశ్యకావ్యములు నాయికా నాయకుల హావభావాదుల ననుకరించుట కుపకరించుటచే సామాజికుని యందలి తాత్త్వికరసోద్బోధకమై పారమార్థికానందమును గలిగించుట కుత్తమసాధనంబు లగుచున్నవి. శ్రవ్యకావ్యములు పండితవేద్యములై తన్మాత్రానందజనకము లగుచున్నవి. దృశ్యకావ్యము లన్ననో పండిత పామరరంజకములై సకలజనావర్జకము లగుటచే నుత్తమములై యొప్పుచున్నవి.

ఆంధ్రభాషయందు గీర్వాణభాషయందువలె దృశ్యకావ్యములు పుట్టుటకు పూర్వము పదములు, ద్విపదలు, చూర్ణికలు, కైవారములు,

జతులు మొదలగునవి పుట్టినవి. అవియే యక్షగానము లనఁబడుచున్నవి. సంస్కృతనాటకములఁ బోలిన నాటకము లాంధ్రభాషయందు దత్యర్వాచీనము లనియే చెప్పవచ్చును. ఆంధ్రనాటకము లన్నియుఁ బ్రాయికముగా యక్షగానరూపములుగానే యుండినవి. పూర్వకాలమునఁ బ్రదర్శింపఁ బడుచుండిన వీథినాటకము లన్నియు నిట్టివే. ఈ తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయములోని నాటకములన్నియుగూడ నీరీతివే యనుటకు సందియము లేదు. నాటకము బహుజననిర్వాహ్యము. యక్షగానము గాయకుఁడు డన యనుచరులసహాయముచే గానరూపమైన యితివృత్తమును శ్రోతల కెఱుకపఱచుటచే గాక గీర్వాణాంధ్రద్రవిడాది భాషామిశ్రితమై పామరరంజకమగు హాస్యరసమును గలిగియుండును. ఆటవికజానపదాది ఇతివృత్తములుగల యక్షగానములు క్రమేణ నాగరికుల యాదరాభిమానములను బొంది పురాణైతిహాసప్రసిద్ధములగు రామహరిశ్చంద్ర కృష్ణార్జున నలధ్రువాది పాత్రలఁగలిగి పండితపామర రంజకమై విశేషించి హరిలీలావిలాసరూపములగు కథలయొక్క ప్రచారమున కుపకరించుటచే హరికథ లనబడెనేమో!

యక్షగానములయొక్క పుట్టుకనుగుఱించియు నన్వర్థనామధేయ తను గుఱించియు కీ॥ శే॥ శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు "సుగ్రీవ విజయము" (యక్షగానము) యొక్క పీఠికయందుఁ జర్చించియున్నారు. శ్రీ శాస్త్రిగారి వాక్యములనే యీక్రిందఁ బొందుపఱచియున్నారము.

"ఇట్లు నగరములందు నభిరుచి గొల్పిన యా గేయవిశిష్ట నృత్య దృశ్యములు, జక్కులనువారు (యక్షులు, కళావంతులు) తర్వాత నగరములందును బ్రయోగింపఁ జొచ్చిరి. వీరిప్రయోగములందు దృశ్య మయిన నృత్యాభినయములతోపాటు నధికముగా గేయవచనరూపమైన శ్రవ్యరచనముగూడఁ జేరెను. 1. కురవంజులకంటె యక్షగానములు

1. కురవజాతివారి యంటె = అడుగు (నృత్యవిశేషము) కురవంజె యనబడెను. [శ్రీ వే. ప్రభాకర శాస్త్రిగారి పీఠిక. "సుగ్రీవవిజయము"]

పర్యాప్తముగా శ్రవ్యములగు కవిరచనములు గలవి. వీరి రచనములలో బహువిధములగు పురాణకథలెల్లఁ జేరినవి. కురవంజులలోని సింగి. సింగఁడు పాత్రలు మాఱి రామ నల హరిశ్చంద్ర సీతాదమయంతీ చంద్రమత్యాది పాత్రలు వచ్చినవి. కాని వీనిలో నాటకీకరచనసంస్కార సూచకముగా 'ఎఱుకతసాని' పాత్రము వెలసినది. కురవంజులలోని నేసిరచనలకంటె నత్యధికముగా వీనిలో దేసిచ్ఛందోబద్ధములగు గేయరచనలు ప్రబలినవి. "రాజసభలలో దేవోత్సవములలో ఊరి జాత్రలలో యక్షగంధర్వాది వేషములుధరించి వేశ్యలు ప్రదర్శించు నవి గావునను నృత్యధర్మములకంటె గేయధర్మములధికముగాఁ గలవి కావునను నివి యక్షగానము లనబడెను. కళావంతులలో నొకతెగకు నేడు జక్కులవారను పేరుగలదు."

—: విప్రనారాయణ చరిత్ర పరిష్కరణము :—

తంజావూరులోని నాయకులకాలమునాటి సర్వతోముఖమైన యాంధ్రభాషాభ్యున్నతికి, ఈవిప్రనారాయణ చరిత్రయే నిదర్శనము. ద్విపదలు, జానపదగీతులు, సంభాషణరూపములగుగానములు, చూర్ణికలు, దరువులు మొదలగు వానిచే సకలజనరంజకమై వెలుఁగు నీ చిన్నిపొత్తి మాంధ్రమహాజనుల యాదరామోదములఁ బొందగలదని మా నమ్మకము.

ఈ పరిష్కరణమునకు నీ తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయమునందలి D. 617. M. 706. సంఖ్యగల యేకైక తాళపత్రప్రతియే మాతృక. మాతృక మా పరిష్కరణమునకు నధికముగు శ్రమనివ్వలేదు. ఆంధ్రనాయకరాజులలో శిరోమణియై ఆంధ్రాభాషాభ్యున్నతికి మిగుల శ్రమించిన విజయరాఘవ విరచితమగుటచేతను, గ్రంథము మృదుమధుర పదభూయిష్ఠమై సర్వరంజకమై యుండుటచేతను మేమీ గ్రంథమును ప్రచురించుటకుఁ బూనితిమి. విశేషముగా మాననీయులగు కీ॥ శే॥ శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి సలహా యందు మాకు మిక్కిలి యుత్సా

హమునిచ్చి ప్రోత్సహించినది. మాతృకలో నచ్చటచ్చటి గ్రంథపాతములును, కీటదష్టభాగములు మాచే నైనంతవఱకు పూరింపఁబడి కుండలీకరణములచే సూచింపఁబడియున్నవి. మేము పరిష్కరించిన తాళపత్రగ్రంథముయొక్క తుదిభాగమునందుఁ గొన్ని విజయరాఘవునకును, రాజగోపాలస్వామికిని సంబంధించిన గేయములు కన్పట్టినవి. అవి మృదుమధురములై యున్నందున పాఠకులకు మనోరంజకములై యుండునని దలంచి యనుబంధముగఁ జేర్చియున్నారము.

—: ఇతరగ్రంథములు - విశేషములు :—

మద్రాసు నగరములోని రాజకీయప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమందలి 1912 సంఖ్యగల "భక్తాంఘ్రిరేణు చరిత్ర" మను గ్రంథము కూడ నీ విప్రనారాయణ చరిత్రయే. దానిని "ఉత్తరరంగకవి" రచియించి శ్రీరంగనాథున కంకితము చేసియున్నాఁడు. అందు విప్రనారాయణుఁడను యాళ్వారు చరిత్రాంశములు దక్షిణదేశమందు గల తిరుచినాపల్లి మండలమునఁ గల శ్రీరంగమను క్షేత్రమునందు జరిగినట్లు వర్ణింపఁబడియున్నది. ఆ గ్రంథములోని వాక్యము దిక్రింద నిచ్చియున్నారము.

"ఇవ్విధంబున విఘ్నేశ్వరుని బ్రస్తుతించి తదనంతరంబున నుత్తరరంగరంగధామునికి సమర్పితంబుగా నాయొనర్పంబూనిన "భక్తాంఘ్రిరేణువిలాసం"బను నాటకంబునకుఁ "బ్రధానగణ్యంబైన శ్రీరంగ నగరం బెట్టిదనిన."

మఱియు నీ విప్రనారాయణుండు శ్రీరంగక్షేత్రమందు శ్రీరంగనాథుని సేవింపుచుండినట్లును, తన్నగరంబుననే భగవన్మాయాప్రేరితుఁడై వేశ్యాలోలుఁడగుటయు, పిదప సాక్షాత్కరించిన భగవంతునిచే వరముగా భక్తాంఘ్రిరేణువను నామంబును బొందినట్లును నితివృత్తము వర్ణింపఁబడియున్నది.

" ఇట్లు వినతులుసేయఁగా సంతోషించి శ్రీరంగనాయకులు విప్ర నారాయణునితో నేమనుచున్నారు.

కం॥ తావకభక్తికి మెచ్చితి
నావాఁడవు నీవు విప్రనారాయణ ! నీ
వేవర మడిగిన నొసఁగెదఁ
గావలసిన కోర్కె దెల్పఁగానగు ననఘా !

వ॥ విప్రనారాయణుం డేమనుచున్నాఁడు.

ద్విపద॥ శ్రీరంగనాయక చిత్తాంబుజాత
సారంగరక్షిత సారంగరంగ
ధన్యుండనైన నాదైన్యంబుఁ దొలఁగె
నన్యమొల్లను భవదాశ్రితచరణ
రజముపేరొందవు వరంబిమ్ము మిమ్ము
భజియించి నిశ్చలభక్తి నుండెదను.

వ॥ అనిన విని మందస్మితసుందరవదనారవిందుఁడై యిందిరావిభుం డతనికి " తొండరడిప్పొడియాళ్వార "ని పేరొసంగి చోడరాజును జూచి యేమనుచున్నాఁడు.

చ॥ క్షితివర ! దీనికిఁ బసిఁడిగిన్నెయ నిచ్చినవాఁడ నేనె యీ
యతివ మదాజ్ఞచేఁ బొడము నచ్చర ! వందనమాలి కాంశజుం
డితఁడును నేను వేడ్కకయి యిర్వురిఁ గూర్చితి నన్నుజూచిన
ట్లతులితభక్తిఁజూచి యనయంబు భజింపుము నామభక్తునిన్".

*[See the No. 1912. Bhaktanghrirenu Charitamu Vol. VIII. Yakshaganas and Dandakas of the Descriptive catalogue of the Telugu manuscripts of Government Oriental Manuscripts Library, Madras.]*

మఱియు నీ తంజాపూరు సరస్వతీమహల్ గ్రంథాలయమునందు 'విప్రనారాయణ చరిత్ర' మను గ్రంథము ప్రబంధరూపమున నొకటి యున్నది. తదేతద్గ్రంథకర్త పిడుగు వెంకటకవి. పిడుగు మల్లనార్యుని కుమారుఁడు. ఇతఁడు వ్రాసిన విప్ర నారాయణ చరిత్రములోఁగూడ విప్రనారాయణునకు సంబం ధించిన కథావిశేషములన్నియు శ్రీరంగక్షేత్రమందే జరిగినట్లు వర్ణింపఁబడియున్నవి. దానిలోని మొదటిపద్య మీరీతిని గన్పట్టుచున్నది.

శా॥ 'శ్రీరంగంబున శేషశాయి యగుచున్ శ్రీరంగ నాంచారుతోఁ
గారుణ్యాకరమూర్తియై చెలఁగి లోకంబెల్ల రక్షింపఁ గా
వేరీ మధ్యనివాసుఁడై పరగు నావిశ్వేశు రంగేశ్వరున్
సారస్ఫూర్తిఁ దలంతు నన్ను గృపచేఁ జాలన్ విలోకింపఁగన్.

*[See the No. D. 256 ; M. 226 Vipranarayana Charitramu of the Descriptive catalogue of the Telugu manuscripts of the Tanjore Maharaja Sarfoji's Saraswathi Mahal Library.]*

మఱియు వైష్ణవమతప్రతిష్ఠాపనాచార్యులగు శ్రీమద్రామానుజా చార్యులు ద్రావిడప్రబంధాదులను వైష్ణవమతమును బ్రచారము లోనికిఁ దెచ్చుటకుఁ బూర్వమే పన్నిద్దరాళ్వారులు ప్రసిద్ధులై యుండిరి. వారిలో నొకఁడు విప్రనారాయణుఁడు. శ్రీమ ద్రామానుజాచార్యులు పదునొకండవశతాబ్దపునాటివారని చారిత్రక నిపుణులు నిర్ణయించియున్నారు. కావున విప్రనారాయణుఁడు పదునొకండవశతాబ్దమునకుఁ బూర్వముండినవాఁ డనుటలో సందేహముండదు.

ఇట్లు పరిశీలించి చూచిన విప్రనారాయణుని కథాసందర్భము లన్నియు జరిగినస్థలము శ్రీరంగక్షేత్రమై యున్నది. విప్రనారాయణుం

డారాధించిన దైవము శ్రీరంగనాథుఁడు. ఇతఁడు రచియించిన ద్రావిడ ప్రబంధములోని పాటలుకూడ శ్రీరంగనాథస్వామిని గుఱించియు, శ్రీరంగక్షేత్రమును గుఱించియునై యున్నవి.

ప్రస్తుతపు పరిష్కరణములో విప్రనారాయణుఁడు తంజావూరు మండలములోని శ్రీ రాజమన్నారుగుడి (మన్నారుగుడి) యను శ్రీ రాజ గోపాలక్షేత్రమందు, భక్తపరిశోధనలీలావినోదుఁడగు రాజగోపాల స్వామిచేఁ బ్రేరితుఁడై వేశ్యాలోలుఁడై తుదకు భగవత్కృపను బొంది నట్లు వర్ణింపఁబడియున్నది. విచిత్రవిషయమేమన గ్రంథకర్తయు విజయరాఘవనాయకుఁడే (A.D. 1633–73). విప్రనారాయణుని విచారించు న్యాయస్థానమున కధిపతియు విజయరాఘవనాయకుఁడే ! ఏ పదియవశతాబ్దముననో విలసిల్లు విప్రనారాయణుని 17-వ శతాబ్ద మునకుఁ దీసికొనివచ్చి విజయరాఘవనాయకునితో నతనిని జోడించు టకై మన్నారుగుడియందు కథాకలాపమును సృష్టించిన కవియొక్క స్వాతంత్ర్యము హద్దుమీరి నడిచినదనుటలో సందేహములేదు ! కవులు నిరంకుశులు గదా !

తంజావూరాంధ్రనాయకసామ్రాజ్యమునకు సూర్యచంద్రులవలె ప్రకాశమును ప్రసాదించిన మహనీయప్రతాపులగు రఘునాథనాయకుఁడును విజయరాఘవనాయకుఁడును రాజగోపాలస్వామియొక్క పరమభక్తులు. వారిద్దఱి వైష్ణవాభిమానమునకు మేరయేలేదు. కాబట్టి యతిప్రసిద్ధ భాగవతాగ్రేసరుఁడగు విప్రనారాయణునియందును, తన కులదైవమగు శ్రీమన్నారుగుడియందు వెలసిన రాజగోపాలస్వామియందును నత్యంత భక్తియుక్తుఁడైన విజయరాఘవనాయకుఁడు పూర్వము జరిగిన కథను తనకాలమందు మన్నారుగుడియందు జరిగినట్లు వర్ణించుట కవకాశ

మిచ్చుట యతని భక్త్యావేశపూరితమగు మనోభావవిలసితమనియే చెప్పనొప్పును.

దేవదేవి రాజాస్థానమునకుఁ దనసంగీతప్రదర్శనార్థము వచ్చినప్పుడు వర్ణింపఁబడిన విజయరాఘవనాయకభూపాలుని సరస సల్లాపగోష్ఠియు, దేవాలయపు పారుపత్యగాఁడు వర్ణించిన పాదరేఖల గుఱించిన వాక్యములును బరిశీలించి చూచువారలకు విజయరాఘవ నాయకుఁడీగ్రంథమునకుఁ గర్తయని యూహించుటకు వీలుండదు. కృత్యాదిని శోభిల్లు సీసపద్యము విజయరాఘవనాయకుని కృతులనన్నిటను నాదిమపద్యముగా వచ్చునదిగానుండుట యనునదొక్కటియే విజయ రాఘవుఁడీగ్రంథమునకుఁ గర్తయనుటకాధారమై యున్నది. గ్రంథాంతర మందలి ఘట్టములను బరికించి చూచినప్పు డీయాధారముయొక్క బలహీనత స్పష్టముకాఁగలదు. సరసుఁడగు నొకానొక కవి పైన నుదాహృతమైన విచిత్రసంవిధానపద్ధతిని గ్రంథమును రచియించి కవిజనాశ్రయుఁడగు విజయరాఘవుని పేరనే యద్దానిని విలసిల్లునట్లు చేసియుండవచ్చునని తలంచుచున్నారము.

ఈవిప్రనారాయణచరిత్ర (యక్షగానము) ను బ్రచురించుటకు సమ్మతించి తత్కార్యమునకు మమ్ము నియమించి యాంధ్రసారస్వతము నకు నీ యల్పీయమైన సేవఁ జేయుటకు మహదవకాశము నొసంగిన సరస్వతీమహల్ గ్రంథాలయ గౌరవకార్యదర్శి శ్రీ యస్. గోపాలన్, బి.ఏ., బి.ఎల్., గారికి మాహృదయపూర్వకాభివందనముల నర్పించు చున్నారము. ఈపరిష్కరణమున నాదినుండియు మాకు చేదోడు వాదోడుగానుండి యపూర్వములైన సలహాలనొసంగి, కట్టకడపటి వఱకు సాహాయ్యమొనరించిన తిరుపతి శ్రీ వేంకటేశ్వరప్రాచ్య విద్యా

సంస్థయందు విమర్శకోద్యోగులై యున్న యస్మన్మిత్రులు శ్రీపంగనామాల బాలకృష్ణమూర్తి, యం.ఏ., బి.ఓ.ఎల్., గారికి మాహారాభివందనములను దెల్పుచున్నారము. శుద్ధముగను ప్రామాదికములధికముగ లేకుండునట్లును పాటుపడి త్వరలో గ్రంథముయొక్క ముద్రణమును దృష్టికరముగా సాగించిన రత్నప్రెస్ వారికిని మాధన్యవాదముల నర్పించుచు నింతటితో విరమించుచున్నారము.

శుభమస్తు.

సరస్వతీ మహల్ లైబ్రరి,
తంజావూరు,
31—10—1950.

పరిష్కర్తలు.



శ్రీరస్తు.

# విప్రనారాయణ చరిత్ర.

( యక్షగానము )

---

సీ॥ భోజకన్యాముఖాంభోజరాజమరాళ
సత్యాఘనస్తనస్తబకభృంగ,
జాంబవతీవిలోచనచకోరశశాంక
మిత్రవిందాతటిన్మేఘరూప,
భద్రాపశాపసభద్రదంతావళ
వరసుదంతామనోవనమృగేంద్ర,
లక్షణాయాచకలాపిపర్జన్య
ఘనసుమతాలతాపారిజాత

గీ॥ శోభనశ్రీసహస్రచక్షుఃప్రసార
హారసారమసార మోహనశరీర
విజయరాఘవభూపాల భజనలోల
క్షేమ మొడ్చెద రాజగోపాల సిస.

కైవారం॥ రాజగోపాలచరణారవిందభజనానందసాంద్ర ! రఘునాథ నాయకరత్నాకరాపతీర్ణసంపూర్ణపూర్ణిమచంద్ర ! పాండ్యముండీరాదివైరిగజకంఠీరవకిశోర ! కళావత్యంబికాకుమార ! చంద్రోపేంద్రసురేంద్రనందనకందర్పకోటిసౌందర్యధుర్య ! జీర్ణకర్ణాట సామ్రాజ్యసింహాసనస్థాపనాచార్య ! సమరసమయాచరితసమస్త నిస్తులతులాపురుషాదిమహాదానాపదానప్రవర్తితకీర్తిధారేయ ! సంగరరంగగాంగేయ ! ప్రతిదినబహుసహస్రబ్రాహ్మణాభీష్ట

మృష్టాన్నదానదీక్షాధురీణ ! మానినీనూతనపంచబాణ ! విశ్వ విశ్వంభరాభరణవిచక్షణదక్షిణభుజదండ ! శాశ్వతైశ్వర్యధౌరంధర్యమేరుకోదండ ! దక్షిణసింహాసనపట్టభద్ర ! కలియుగరామభద్ర ! చతుర్విధకవితానిర్వాహకసార్వభౌమ ! బిరుదాంగదవిరాజమానచరణాంభోజ ! కవిసమాజభోజ ! జనకచరణరాజీవసేవావిధాయక ! విజయరాఘవనాయక ! పరాకు! స్వామివారు హవణించిన విప్రనారాయణచరిత్రంబను విచిత్రనాటకంబు నటనపటిమ గనుపించ వినుపించేము, విన నవధరించవయ్యా ! పరాకు ! స్వామీ ! పరాకు !

ద్విపద॥ కమనీయదక్షిణకాశ్మీర మనఁగ
రమణీయమగు చోళరాజ్యంబునందు
నిండారుకావేరినీటికాలువల
పండెడుముత్యాలపైరుల నొప్పు
చెఱకురాజనములచేలచేఁజాల
సొబగుతరంబగు "మండగుడి" యనుపేర
నగ్రజన్మాధారమై మహామహిళ
కగ్రహారంబై నయగ్రహారముఁ
బరణించుపరిశుద్ధభువనప్రసిద్ధ
ధరణీసురాన్వయోదధిసుధాకరుఁడు
అనఘుండు వేదవేదాంగపారగుఁడు
వినయవివేకాదివిద్యల కిరవు
కావ్యనాటకవేది గర్భవైష్ణవుఁడు
దివ్యప్రబంధోపదేశిదేశకుఁడు
భాగవతాగ్రణి పరమపావనుఁడు
యోగవిద్యాశాలి యుపనిషద్వేది

పరమపావనుఁ డేకపత్నీవ్రతుండు
గురుభక్తిపరుఁడు సద్గుణములప్రోపు
పాఁడియుఁ బంటయు బలఁగంబుఁ గలిగి
వేడుకఁ దనచేత విడిముడిఁ గలిగి
నారాయణుండను నవవిధభక్తి
పారాయణుఁడగుచు బాల్యంబునందు
పురుపంపుమొలకకు మంచినెత్తావి
అరఁగుఁదెచ్చినరీతి హరిభక్తిఁ గాంచి
యతఁడు ప్రాతస్స్నాన మాచరింపుచును
సతతంబు జపతపస్స్వాధ్యాయహోమ
దేవపూజావైశ్వదేవాదివిధులఁ
గావింపుచునుఁ గొంతకాల మిట్లుండి
సంతతవీరవైష్ణవగోష్ఠివలన
నెంతోవిరక్తుఁడై యిల్లెల్ల రోసి
తల్లియుఁ దండ్రియు త్తరువుఁ బాలింప
నిల్లాలిఁ బుట్టినయింటి కంపించి
యాచార్యుచేతఁ జక్రాంకితుండౌచు
శ్రీచూర్ణరేఖల చెలువు రాణింప
సొరపుమీరఁగ ద్వాదశోర్ధ్వపుండ్రములు
ధరియించి దాసరితావడాల్ పైడి
తిరుమంత్రద్వయమునుఁ దెలియ నూహించి
చరమగీతశ్లోకజపము సేయుచును
ధరణిపైఁ దీర్థయాత్రాపరుండగుచుఁ
జరియించి దివ్యదేశము లెల్లఁ జూచి
మోక్షలక్ష్మీమనోమోహనంబైన
దక్షిణద్వారకాస్థలిఁ జేరవచ్చె.

వ॥ ఈవిధంబున విష్ణుకీర్తనపారాయణుండగు విప్రనారాయణుం డుపయనగతులఁ గదలివచ్చెనట యెటువలెను.

కేదారగౌళ - ఝంపతాళం

ధీరవైష్ణవముఖ్యుండు మూర్తీభ
వించెనని జనులు పొగడ
ద్వారకానగరమునకు శ్రీవిప్ర
నారాయణుండు వచ్చెను.

వ॥ ఇవ్విధంబున నిజమందిరంబు వెడలివచ్చిన వ్రతపురందరుండు భూలోకంబునఁ గలదివ్యదేశంబు లెల్ల సేవించి, గోపాలదేవునకుఁ గాఁపురంబగు దక్షిణద్వారకాపురంబు దర్శింపఁ గోరి యచ్చటి వైభవంబు వర్ణింపుచు వచ్చెనట యెటులనిన.

మంజరీ ద్విపద॥ చోళదేశంబున సొంపు దీపింప
దక్షిణద్వారకాస్థలము పెంపెచ్చిన
పచ్చరాగోడలు పసిఁడిమేడలును
ప్రాయంపుచేడెలు పరఁగువాడలును
మకరతోరణములు మదవారణములు
మిన్నునుఁ దాఁకుచు మెఱయు కోటలును
నగపాల మించిన మలయకూటములు
చెలువుమీరినయట్టి చెఱువుతోఁటలును
వేడుకచెల్లించు వింతవేములును
రమణమైఁ దనరారు రాజవీథులును
వేదఘోషణములు వేళలయందు
తిరుగాఁ గనుపించు తిరుమాళిగలును
పరతత్త్వమెఱిఁగిన పరమవైష్ణవులు
యతులు సన్యాసు లేకాంగివర్యులును

ఘనమైనతేజము గలిగి రాజించు
పదునారువేల గోపస్త్రీలఁ గూడి
పన్నారు విహరించుమహిమచే వెలయు
నాదక్షిణద్వారకాతిశయంబుఁ
గన్నులపండువుగాఁ జూడవలదె !

వ॥ అని యద్వీటిసంపదల మాటిమాటికిఁ గొనియాడుచు వచ్చి
యన్నగరంబుఁ బ్రవేశించి యేమని కొనియాడుచున్నాఁడు.

పదం - కాంభోది - ఝంపతాళం

నేఁడెంత శుభదినంబో నాతపము
నేఁడు గద ఫలియించెను
వేడుకలు మీరంగను ద్వారకా
విభుని నేఁ బొడగంటిని ॥ 1

భవబంధములు వీడెను నేఁడు గద
పరమపావనుండ నైతి
నవతులేనిహరిద్రానదిలోన
స్నానంబు సేయఁ గంటి ॥ 2

పాపంబు రంజిల్లెను నేఁడు గద
పరమవైష్ణవుండ నైతి
కైవల్యసరణి నున్నకృష్ణుపు
ష్కరణి నేఁ బొడగంటిని ॥ 3

నావిచారము తీరెను నేఁడు గద
నాజన్మ మీడేరెను
శ్రీవిమానమునసున్న యావేద
శృంగంబుఁ బొడగంటిని ॥ 4

వ॥ అని పలికి యవ్వీటి విజయరాఘవభూపాలకల్పితంబులై యుప్పరంబంటిన గొప్పగోపురప్రాకారంబుల దాఁటి పక్షిరాజ లక్షణలక్షితంబైన ధ్వజస్తంభంబుచెంగట సాష్టాంగంబుగా వందప్రణామంబు లాచరించి యద్దేవాలయంబునకు దక్షిణదిగ్భాగంబున నున్న హేమారవిందేందిరామందిరంబుఁ బ్రవేశించి యాదేవిని సేవించి యేమనుచున్నాఁడు.

ద్విపద॥ కలశాంబునిధికన్య ! కల్యాణధన్య !
సలలితసౌజన్య ! జగదేకమాన్య !
వందారుశర్వాణి ! వారిజపాణి !
మందరధరురాణి ! మన్నారు (రా) ణి !
పరమదయాలోక ! పాలితలోక !
నిరతగజానేకనియతాభిషేక !
భారతీ పార్వతీ భామలలోనఁ
గోరినవరమిచ్చుకువలయనయన !
శ్రీరంగమలవల్లి ! చెలువైనతల్లి !
కాచి రక్షింపవే కనకాబ్జవల్లి !

వ॥ అని యమ్మహాదేవిని మఱియు నేమనికొనియాడుచున్నాఁడు.

పదం - గౌళిపంతు - ఆటతాళం

శరణు శరణు మాచంగమ్మా, నీపాదములకు
శరణు శరణు మాచంగమ్మా, చాల
కరుణతో నన్ను బ్రోచుకారుణ్యనిధివమ్మా

పదం॥ అలికులనీలవేణివమ్మా, మాచంగమ్మా
చెలువైన అంబుజపాణివమ్మా, సరిసాటిలేని
కులుకుగుబ్బలగుమ్మవమ్మా, మారాజగో
పాలుపట్టపురాణివమ్మా, ముద్దులగుమ్మా ॥ శరణు ॥

వ॥ అని స్తుతియించి యాదేవికృపారసంబు వడసి యుపకంఠంబున నున్నవైకుంఠసభాదిదివ్యమంటపంబుల వీక్షించి చంపకపున్నాగ తరుచ్ఛాయాదంతురంబగు ప్రాకారాంతరంబునఁ బ్రదక్షిణంబుగా వచ్చి సోపానంబు లెక్కి యచ్యుతభూపాలమంటపమార్గంబున నిర్గమించి ద్వారపాలకులకు జోహారుసేసి లోని కరిగి భానుకోటిసమానస్వాయంభువమానగర్భగృహాంతరాళంబుఁ జేరి పెన్నిధిఁ గాంచినట్లు సన్నిధిఁ గాంచి యుప్పొంగి చిరత్నరత్న సింహాసనాగ్రంబున కటితటంబుఘటియించిన కాంచనపటాంచలంబులు నటియింప విజయరాఘవభూపాలుండర్పించినకిరీటిపచ్చల కిరీటంబు మొదలైన పెద్దపెద్దసొమ్ములుఁ జెక్కి మురుకెంపుల సొంపులు పదివేలభానుబింబంబులావిర్భవించినట్లు గర్భగృహాభ్యంతర్బహిఃప్రదేశంబు లెల్ల ప్రకాశింపఁజేయ గెంగేలఁ గీలించిన చెంగోలుడాలు జాలువార రుక్మిణీసత్యభామలతోఁ జెన్నారుచున్నమన్నారుదేవునిఁ గన్నారసేవించి తన్మూర్తిభావించి మనోవీధికి రావించి యనేకనమస్కారంబులఁ గావించి శ్రీభూమీనీళా సమేతుఁడైన పరవాసుదేవుని భజియించి యానందబాష్పధారలు జాలుకొనఁ బులకలుఁ గీలుకొన ననురాగంపు మొలకలు మొలవ నను నేలుకొనుమని ప్రార్థింపుచు నేమనుచున్నాఁడు.

ద్విపద॥ శ్రీరాజగోపాల ! చిరకీర్తిజాల !
కారుణ్యగుణశీల ! కల్యాణలోల !
గోవర్ధనోద్ధార ! గోపకుమార !
భావజసమరూప ! బహుళప్రతాప !
నందగోపకుమార ! నవనీతచోర !
చందనమందారసమకీర్తిహార !
కరుణారసాపాంగ ! గరుడతురంగ !
పరమవచోవేద్య ! భవరోగవైద్య !

దక్షిణద్వారహాస్థలికృతలీల!
రక్షింపఁగదవయ్య రాజగోపాల!

వ॥ చేరి మఱియు నేమనుచున్నాఁడు.

పదం - ఘంటారవం - అటతాళం

సేవకుండనై నీవంచఁ జేరితి యీడేరితి
భావుకజనక దైత్యభంజన భక్తరంజన ॥ పల్లవి ॥

రాజగోపాల రమణీయవేష
రాధావల్లభ గోపాలకృష్ణ
హరిహరి హరిహరిరో హరిరో
మన్నమన్న మన్న సంపంగిమన్నా
కోరిక లిచ్చి నన్నేలుకోవయ్యా చేరి రావయ్యా
శారదనీరదనర్ణశయనా పద్మనయనా ॥ 1

వేరేదైవముల భావించను సేవించను
నారదవరద రాజనాయక ప్రాణనాయక
పలుమారు నీదుపదంబులు
తలఁచినవారలకు సుకవితాస్ఫురణంబుల్
కలుగుట యరుదె యెన్నగఁ
బలుకుల చెలిమగనిఁ గన్నబంగరుమన్నా ॥ 2

వ॥ అని మఱియు నేమనికొనియాడుచున్నాఁడు.

కం॥ కోరిక చేరికయయ్యెను
మీరక నామనసు వదలి మెదలకు మయ్యా
సారెకు మిముఁ బ్రార్థించెద
సారసనాయకునిఁ గన్నసంపఁగిమన్నా.

వ॥ అని సన్నుతింప సన్నిధివారాకృతార్థునకుఁ దీర్ఘప్రసాదంబు లొసఁగిరట యెటువలెను. అప్పుడప్పుడమివేల్పు గుడివెడలి కదలి తన యానందంబున నానందనందనుని మందిరంబు ముందఱనున్న యనంతంబున విష్వక్సేనగరుడాది పన్నిద్ద రాళ్వారులు మొదలైన నిత్యభక్తుల నారాధించి తాను యవ్వన మాలికి వనమాలికాకైంకర్యంబు సేయంగోరి యమ్మురవైరి భవనంబున కుత్తరదిగ్భాగంబున హరిద్రానదీతీరచంపకారామ సమీపంబునఁ గావేరి యిడుబాయలుగాఁబాయఁ గలిగిన యొక చాయ నొక్కవిశాల ప్రదేశంబున, హృదయాభిరామంబుగా నారామంబుఁ గావింపఁబూని యొకశుభముహూర్తంబున విష్వక్సే నునకు నారికేళంబు సమర్పించి తత్సమయంబునఁ దోఁచు దివ్య శకునంబులకు నుప్పొంగుచుఁ దటినీతటంబున నూటిగా శాటిచీరిఁ గట్టి కుద్దాలంబుఁ జేఁబట్టి కాల్వలుఁదీర్చి గనిమ లమర్చి చిటిపఱా లేరివైచి చిటిపొటిచెట్లు పెఱికి పారవైచి బావులు నిర్మించి పాదు లేర్పరించి విరినూటిని నారునాటి నానాటికిఁ బ్రోదిసేయుచు శిష్యునకు నాజ్ఞసేయుచు ఘటయంత్రకమనోరథమనస్వతం త్రుండై కేదారంబులకు నీరునడిపెనట యెటువలెను.

కురంజి - ఝంప - త్యాగమానం

పాదికి నూఱుబానలనీరు
చేదితే పొదలు చేమంతిపొదలు
ఒండె గోపాలరెండె గోపాల
చెండుఁ జేకొన్న శ్రీరాజమన్నా ॥
చలువలఁ దేరుసంపంగిపైరు
కాల్వలకె నూఱుకడవలనీరు
విరజాజిపొదలు వికసించె నేఁడు
సురపున్నాగలు సొంపు రాణించె

మల్లెలు పూచె మగతేఁటి చొచ్చె
మొల్లలు చిన్ని మొగ్గలువైచె
పొన్నలు పెరిగె పొగడలుఁ బొదలె
సన్నజాజులకు సమయము వచ్చె
ఎలదోటవిరులు హేరాళమాయె
ఫల మిచ్చి నన్ను బనిగొనవయ్యా ॥

వ॥ ఇవ్విధంబున విప్రశిఖామణి పోషింప నశేషతరులతాకుంజ పుంజంబులు రంజిల్ల నవ్వనంబునకు జవ్వనంబువచ్చె నదె యెటువలెను.

ద్విపద॥ ద్వీపాంతరపుద్రాక్ష తీపిపందిరులు
పైపై గుబాళించు పారిజాతములు
పాదిరుల్ తావిసంపంగిజొంపములు
మోదుగుల్ గేదగుల్ మొల్లపూపొదలు
గంధంపుమ్రాఁకులు ఘనసారతరులు
మందారములు తియ్యమావిజొంపములు
పొన్నలు పొగడలు పోఁకమ్రాఁకులును
(సన్నజాజులుమంచి జామమ్రాఁకులును)
కురువేరుదిన్నెలు గుజ్జుగొజ్జఁగులు
పరువంపుమరువంపు పాదివీథులును
మారేళ్లు నేరేళ్ల మల్లెపూపొదలు
నారంగలుంగముల్ నవలవంగములు
ఖర్జూరతరువులు కమ్మనిమ్మలును
భూర్జముల్ సంతానభూజరాజములు
కొండగోఁగులు నిండుగోరంటపొదలు
బండిగురివెందచప్పరపుదిన్నియలు

కలిగొట్టు కస్తూరిగన్నేరుపొదలు
తిలకనమేరువుల్ దేవదారులును
(నాగమల్లెలు మంచి) నారికేళములు
(తగరంపుతరువులు తగుకానుగులును)
తొలుదొల్తఁజిగురులై తొగరులై పొడమె
తలిరులై దళములై (తగజూడఁ) బొడమె
నవముగాఁ జిన్నిక్రొన్ననలంకురించె
నవిగుత్తులై యత్తి యరవిరులయ్యె
నంతటనిండార నవివికసించె
పొంతనే జలజల పుష్పొదుల్ రాలె
తేనె లాపుష్పొడితిప్పలమీఁద
సోనవానలరీతి జోరునఁ గురిసె
నవి కాల్వలై యేఱులై ప్రవహించ
హవణినయరవిరుల్ హరిగోళ్ళమీఁద
తేంటులు తదుభయతీరముల్ జేరె
బోంటులతో రాకపోకలు గలిగె
అచ్చటఁ బొడమిన యాళలాటువులు
పచ్చనై దోరలై పక్వంబులగుచు
ఫలములై మించునాఫలరసధార
చిలుకలు నోరూరి చెంగటఁ బారె
జడిగొని గుజ్జుగొజ్జఁగిపొదల్ గురియ
విడివడి జాల్కొని వెల్లువల్గట్టి
మగతాల నిగిడారుమడువులు మీఱి
యెగబారె పన్నీటియేఁటికాలువలు
ఘనసారతరువుల గంబురాలురుల
గనిమలై దిన్నలై గట్టయ్యె నచట

నీవిధంబునఁ జాలయింపునొంపెసఁగ
నావనవై భవంబపుడు రాణించె.

వ॥ ఇవ్విధంబున నవ్విప్రకుమారుండు శరీరాయాసంబున కోర్చి
జలంబు మార్చి పోషింప నాకాంతారంబు గొంతకాలంబునకు
వేరుబారి వివిధకుసుమంబుల శాఖోపశాఖమానంబై చిగురులతో
గరుల మొగ్గలతావుల పూవుల గుత్తులయెత్తులసోనల శలాటుల
నీటులఫలంబులకులంబుల బలసి వెలసి సర్వకుసుమవిశ్రుతంబై
యతనినయనారవిందంబుల కానందంబు సంపాదింప వనమాలిక
కైంకర్యంబుఁ గావింపఁ బూనియున్న యనంతర కథాసంవిధాన
బెటువలెను.

ఇవ్విధంబున నారామకైంకర్యపరుండైన ద్విజనందనునకు
నిజనందనరసావేశంబు గల్పించి యతనిపట్లఁ గొంతవినోదంబు
నడిపింపంగోరి శౌరి గుడిసేవచేయు సానికూఁతుల వంగడంబునఁ
దిద్దఱ దివ్యాంగనలఁ బుట్టించెఁ గనుక నాకనకాంగులు కన
కాంబరుప్రేరణంబున విద్యలు నేర్చినకారణంబున నిచుళా
నగరంబేలు చోళభూపాలునిపాలికి వచ్చురాకకుమున్నుగా నన్న
రేంద్రచంద్రుండొక చంద్రశాలకుఁ గొలువునకు వచ్చెనట
యెటువలెను.

ద్విపద॥ శ్రీరాజగోపాలసేవచేఁ జాల
పేరుగావించిన బిరుదుమన్నీఁడు
లక్షణాన్వితుఁడు కళావతీసుతుఁడు
దాక్షిణ్యశాలి యుత్తమరాజమౌళి
రణముల జగజెట్టి రఘునాథుపట్టి
గుణరత్నములదీవి గురుజనసేవి

బహుదానపరుఁడు భూపాలశేఖరుఁడు
సహజగుణస్ఫూర్తి సర్వజ్ఞమూర్తి
రతులకు రతిరాజు రాజులరాజు
వితరణగుణశౌరి విబుధజంభారి
జగదుపకారి వైష్ణవమతోద్ధారి
తగవులవీడు చింతామణిజోడు
నీతికిమాంధాత నియమసంధాత
జాతివార్తలమేటి శౌర్యకిరీటి
సరసుఁడు నెరజాణ చక్కనివాఁడు
పరమవైష్ణవులచేపట్టుకూచంబు
పలికి బొంకనివాఁడు పరమవివేకి
నిలుకడగలవాఁడు నిత్యాన్నదాత
పట్టభద్రుండు కృపాసముద్రుండు
చుట్టాలసురభి రాజుల మేలుబంతి
పరశరణాగతవజ్రపంజరుఁడు
నరులపాలిటిపున్నమచందమామ
ఏకవీర్యుఁడు జగదేకవదాన్యుఁ
డాకారమన్మథుం డధికసాహసుఁడు
కోరినవారికిఁగొంగుబంగారు
చేరువమేరు వాశ్రితవర్గమునకు
పేదలపాలిటిపెన్నిధానంబు
వేదకోవిదులకు వెలలేనిసొమ్ము
అనుమానమునఁ దేలి యావనమాలి
చనువరియిల్లాలిచనుబాలు గ్రోలి
పెరిగినయన్న గోఖిలమౌనికన్న
పరతత్త్వరుచిఁ గన్నపాయంపుమిన్న

విజయరాఘవశౌరి విద్యావిహారి
భుజబలకంసారి పూర్ణసంసారి
అన్నిటనెరధాని యారాజధాని
మన్ననతో నేలు మహి మేలు మేలు

జతి - కైవారం

తరుణీజనకుసుమసాయక
తంజాపురీనాయక పరాకు.

॥ అష్టకం ॥

రాజముఖి వినవమ్మ చక్కని
రాజగోపాలచంద్రుని
రాజసమ్మున తోడితేగదే
రతుల యారేయిఁ గూడను ॥
తేజమున సరిలేక మించిన
దీనజనమందారుని
భోజరాజతనూజ నేలిన
భువనమోహనగాత్రుని ॥

దరువు - మధ్యమావతి - ఆది

నెర నీటుమీరంగ నిచుళాధినాథుండు
గురి దొరల్ గొలువంగఁ గొలువుకు వచ్చెన్ ॥

వ॥ ఇవ్విధంబున నవ్వసుధేశ్వరుండు బహువిధమణిగణకిరణ సాంద్రనిస్తంద్రచంద్రశాలాంతరాళంబుఁ జేరి మీరి సారంగనయనలతోఁ జెలువుమీర కొలువై యుండెనట యెటువలెను.

వ॥ ఆవేళ చోళభూపాలతిలకంబు సంగీతభంగితాంతరంగుండై యంగనాహితులం గనుంగొని సరసవిలాసవాగ్మాధురీమంజరీ ధౌరంధరధురీణుండై యొక్కజక్కవగుబ్బెతకుఁ బుక్కిటివిడె మొసంగి, కెంగేల నొక్కశృంగారవతి కీలుజడ గీలించి, కొటవ్రేల నొక్కకుటిలకుంతలనీవీబంధంబు జాఱమీటి, యొక్క బిబ్బోకవతి సిబ్బెంపుగబ్బిగుబ్బ లుబ్బరంబుగా ఘనతరనఖరేఖలఁ జీరి, యొక్కయంబుజనయనమధుమధురసమధురాధరసుధారస ధారలఁ గ్రోలి, మంజులమృదుళమహనీయభావనీయకరసరసిజ యుగళంబు మోడ్చి యొక్కపంకజాక్షిబింకపుపాలిండ్లు సంకుమదకుంకుమపంకంబుల నలంది, యొక్కరంభోరుపు పరిరంభణం బొనర్చి, యొక్కకుంకుమగంధి నంకంబున నుంచి యంచితంబుగాఁ గొలువై యున్నయవసరంబున నొక్కపరిచారము చెలి చేరి యారాజశేఖరునితో నేమని విన్నవింపుచున్నది.

ఓరాజన్యమూర్ధన్య! రాజగోపాలస్వామి సేవకురాలైన దేవదేవి దేవరకు భరతసంగీతాదివిద్యల వినుపించ నుత్సహించి సంగీతమేళంబు హవణించుకొని బైటికూటంబున వచ్చియున్న దయ్యా. అయితే రప్పించుమా.

అప్పు డాజనపతిపంపున వారుఁ బిలువ నాకలుపకంఠి చంటిపై జంటగుబ్బలనును పట్టు రవికెఁగనుపట్టుదేశవాళి వానెప్రకాశింప నెరసాముగొప్పకొప్పుకప్పు గుప్పళింపబురుసాచీరపింజలు చరణ మంజీరంబుతోఁజీరాడ బాహుమూలకాంతులు గుబ్బలపైఁ గోరాడ తనరూపురేఖలు మదనమదపతితోఁ బోరాడ నిజాగ్రజతో జోడుగూడి వచ్చెనట యెటువలెను.

గుమ్మకాంభోజి - అటతాళం

కైవసంబుగా కాముకులమీఁదను
భావజుండేసిన పసిఁడితూపనఁగ
దేవదేవి వచ్చెఁ దెరవలు గొలువంగ
భూవరశేఖరుఁడు పొగడఁగ నపుడు
మొక్కెను మొక్కె నయ్యా
చక్కెరవిల్తుని మించినసార్వభౌము ॥
ఓబాలికలార యించుక సేవ పదకేళివినిపించరె ॥

వ॥ అనిన నమ్మదపురాళయానలు మృదువుగాను సావధానలై పదము వినుపించిరట యెటువలెను.

ఇవ్విధంబున నాట్యంబు వినుపించిన జవ్వనులకు బహుసాచీ కొక్కవరుససొమ్ములు పాలించెనట యెటువలెను.

ఈరీతిఁ బాలించి యమ్మహీకాంతుండు అంతఃపురంబుఁ బ్రవే శించెనట యెటువలెను.

ఇవ్విధంబున నప్పద్మనయన యప్పయుండాను బార్థివేంద్రుని మెప్పించి యాతండిచ్చిన యీవులఁ జేకొని తరలిమఱలివచ్చుచు మండువేసవియెండకాకలం బడలి చలిపందిరులజాడలు చెట్లనీడ లరయుచు మధ్యాహ్నసమయంబునకు దైవవశంబున నా విప్ర నారాయణునితోటచాయకు వచ్చిరట యెటువలెను.

దరువు

కైవసంబుగాఁ గాముకులమీఁదను
భావజుండేసిన పసిఁడితూపనఁగ
దేవదేవి వచ్చెఁ దెరవలు గొలువంగ
కావేరితీరశృంగారవనముఁ జేర ॥

వ॥ ఇవ్విధంబున వచ్చి యాకృశోదరి నిజసోదరితో నేమనుచున్నది.

పదం ॥ యమునలకాంభోజి.

ఎంతవింతాయె నెలదోఁట
యింతిరో! చూచితే యిచ్చోట
కంతుఁడు విరిసానకత్తిఁ జిమ్మని
కాంతారము వానిగరిడి కాఁబోలు

పదం.

కన్నెరో! చూచితే యీగబ్బూరదీవి
విన్నాణమాయె నీవిరిగుజ్జుమావి
పొన్నమాకులక్రిందిపూదేనెబావి
సన్నగాడ్పులు దెచ్చె సంపంగితావి ॥ 1
మలమలవచ్చెని తుమ్మెదబారు
కలకల మనుచు చిలుకలదుమారు
చలువలదేరు గొజ్జఁగినీటియేరు
వలపలదిగినారు వలఖావారు ॥ 2
కొమ్మరో! వింటివే కోయిలపాట
ఆమనిసరకులు హవణించెపేట
కామునిదళవాయి కాఁపున్నకోట
ఏమని వర్ణింతు నియ్యేటిబైట ॥ 3

వ॥ ఇవ్విధంబున నవ్వనవైభవంబు వర్ణింపుచు వచ్చి వచ్చి యచ్చటచ్చట నామచ్చకంటి నెచ్చెలులతోఁ గూడి విరులఁ జిదిమి సరులుగట్టుచు తొగరుచిగురులఁ గోయుచు పొగరుచిలుకల దగరుకోయిలల నెగురఁదోలుచుఁ దావిపొదలుపూపొదల వదలక మెదలుకొాదమతుమ్మెదల నవల నదలింపుచుఁ బ్రచురప్రమోదంబునఁ బుష్పాపచయంబు సలిపెనట యెటువలెను.

దరువు.

బారంట యలదేఁటి బారంట పెనగేని
గోరంట కేతెమ్మ గోరంటగుత్తి
నెరవాదివై నీవు విరవాది దేకున్న
వెరవేది వరలాచదొరవేది కిపుడు
నీతులా రామటె నీతు లాయెవగలు
జాతులుదెమ్మన్న జాతులేలమ్మా
యావింత లేటికే నీవెంత బెనఁగిన
చావంతిపూబంతి నావంతు గాదా ॥

వ॥ ఈ విధంబునఁ బుష్పాపచయంబు సల్పినశ్రమంబుఁ బాయుటకునై యచ్చటనున్న కాసారతీరంబుఁ జేరి యందుఁ జెలువొందు నిందీవరరాజరాజీవరాజహంసాదివైభవంబులఁ గనుంగొని యాభామినీమణులు తమలోఁ దామే మనుచున్నారు "ఓనారీమణులారా! యీ పుష్పాపచయంబు సల్పినశ్రమంబు వాయుటకునై యీకాసారంబు డిగ్గి జలకేళి సల్పుదామా!" "అలాగే కానీవోయక్కా" యని యివ్విధంబున వారొకరి కొకరొడంబడఁ బల్కుచు నాకాసారంబు డిగ్గి సటియించిన క్రమంబెటువలెను.

జతి॥ దరువు॥

బంగారుబిందెల పన్నీరు నించుక
శృంగారవతిమీఁదఁ జెలియ చల్లెను ॥ 1
పొంగుచుఁ బుప్పొడి పొలఁతి యొక్కతె తెచ్చి
రంగైనయందెల రమణిపైఁ జల్లె ॥ 2
జాళువాచిమ్మనగోవి జాతికుంకుమఁ దెచ్చి
బాల యొక్కతె చిమ్మెఁ బణతిపై నపుడు ॥ 3

విరిఁబోణి యొసఁగినదియు లూని యందెల
తెరవ యొక్కతె చిమ్మె దేవిపై నపుడు ॥ 4

వ॥ ఈ విధంబున నటియింపుచు జలక్రీడలాడి యాకాసారంబు వెడలి చిరత్నవరత్నభూషణాంబరాదిశృంగారంబులు నవరించి యచ్చటనున్నసంపంగిమ్రానిదండ వేదండగమనలతో నాదేవ దేవి నిల్చినక్రమ మెవ్విధాన నుండెను.

అప్పుడాచండ నొక్కపర్ణశాలపురోభాగంబున యోగవిద్య మూర్తీ భవించినట్లు వైరాగ్యంబునకుఁ గరచరణాద్యవయవంబులు వచ్చిన చందంబున వీరవైష్ణవమతంబు శరీరంబు ధరించిన విధంబున విష్ణుభక్తి విగ్రహంబుఁ బరిగ్రహించిన తెఱంగున మాయావాది మతగజకంఠీరవుండు దివ్యప్రబంధానుసంధానధురంధరుండై క తిపయశిష్యపరివేష్టితుండై తన్ను గణింపక విష్ణుకథాగోష్టి నున్న విప్రనారాయణుని విలోకించి కించిన్మందహాసకందళితసుందర వదనారవిందయై యామహానుభావుని దనతర్జనిచేతఁ జూపుచు నిజాగ్రజతో నేమనుచున్నది.

క॥ అక్కక్క చూచితే వీఁ
డక్కట! మనదిక్కుఁ జూడఁడంతటివాఁడా!
చక్కెరవిల్తుని గెల్చిన
ముక్కంటియు నన్నుఁజూచి మోహింపఁడె ఛే!

వ॥ అనినయనుజతో వనజలోచన యేమనుచున్నది.

క॥ నీనటనలఁగని సొక్కను
నానటనలఁజూచి సొక్క నటుఁడో విటుఁడో
యీనారాయణదాసుఁడు
సానులకును మౌనులకును సంగతిగలదే ॥

ప॥ అని పలుకుపలుకులు విని యావాలుగంటి తెఱగంటిదొరయింటి చలువచంటిచెఱకువింటివాని సరకుఁగొనక తెరకలుగాడఁ డహో ధనంబుఁ బోనాడుకొన్న విశ్వామిత్రపరాశరాదుల చరిత్రంబు లుదహరించుచు నయ్యోగపరుని భోగపరునిగాఁ జేసెద నని ప్రతినంబూని నెరసాని దొరసానితనంబు గనుపించ నేగుచున్నది.

పదం॥ కాంభోజి॥ అట॥

దేవదేవి:- పందేమ్యము గద్దటవే వోయక్క
పందేమ్యము గద్దటవే ॥
పందేమ్యము గద్దటవే వీని నా
బంటుగా నేలుకొంటె ॥

అక్క:- అందు కేమి యాలాగైతే నీ
వడిగిన పందేమ్యము నీకిచ్చేనే, ఓచెలియ.

దేవదేవి:- హరిభక్తిఁ దప్పింతునా నాపై
యనురక్తి రప్పింతునా,

అక్క:- పరమపావనుండీబాపఁడు నినుఁ జూచి
బడసేవాఁడు గాఁడే, ఓచెల్లె,

దేవదేవి:- విటునిగా నడపింతునా దాసరి
నటనలు విడుపింతునా,

అక్క:- కటకట ! నీకింతగర్వ మేలే వీఁ
డటువంటివాఁడు గాఁడే, ఓచెల్లె,

దేవదేవి:- గీతము వినిపింతునా మరునికై
జీతము మొనయింతునా,

అక్క:- నాతిరో ! హరికీర్తనకు సొక్కువాఁడు నీ
గీతములకు దక్కునా,

దేవదేవి:- చేరికె రావింతునా విరహము
చేరిక గావింతునా,

అక్క:- శౌరిమందిరముఁ జేరఁబోవువాఁడు
చేరికె రానేర్చునా, ఓచెల్లె,

దేవదేవి:- అడపము గట్టింతునా వానిచే
మడుపులుఁ జుట్టింతునా,

అక్క:- గడిదేరి పలికేవు కైంకర్యపరుఁడు నీ
కడపము గట్టునవే.

వ॥ అని యాజగజంత మాయలాడి నేఁడు రేపట నీప్రోడతపసిని జోడుఁగూడి తపోధనంబుఁ గిలుబాడి తనలీలావిలాసంబు నెరయించి వింతవింతరతుల నలయించి యలయించి తెచ్చెద నని పలికి యాకలికి నింటికి వీడుకొల్పి యొంటి నొకపొదరింటి చేరువకు వచ్చె నటయెటువలెను.

ఆసమయంబున భూసురకుమారుండు తనపాటు ఫలించెనా యని వనవాటికలోఁ గలవిరులు చిదిమి యనఁటిపొదల నదిమి చెండ్లు విండ్లు సరులు బంతులుగా వింతవింతగా హపణించి తనపాలి పెన్నిధియైన రాజగోపాలస్వామిసన్నిధికి వచ్చి యవి సమర్పించె నట యెటువలెను.

పదం॥ ఘంటారవం॥ ఆది॥

దండాలు శార్ఙ్గకోదండ చేకొనవయ్యా
దండము నీకు వేదండవరదా ॥

కరము లెత్తి మొక్కేను కరము లాలించి నా
సరులు చేకొనవయ్యా సంపంగిమన్నా ॥
పంతులు బాడేరు బంతులు జేకొని
వంతుని గన్నయ్యా, నన్ను గరుణింపవయ్యా ॥

వ॥ అని యాసిద్ధసంకల్పుండా వేదండవరదునకుఁ బూదండలు సమ
ర్పించి యాదేవుని యేమని వినుతించెను.

వార్తిక:- శ్రీ చంగమలపల్లిమనోహరాకార! చారుపరమమాణిక్యగోపుర
ప్రాకార! సమస్తదైతేయకమలవనవేదండ! సంభృతశార్ఙ్గకో
దండ! సంతతదక్షిణద్వారకావాస! శారదచంద్రచంద్రికాహాస!
రక్షితచోళభూపాల! శరణం తవ చరణరాజీవయుగళం భజేహమ్॥

వ॥ అని మఱియు నాపంకజనాభునకు సంకీర్తనంబుగా యాలపదం
వినుపించె నట యెటువలెను.

యాలపదం ॥ కేదారగౌళ ॥ మధ్యం.

నీపాదాలు పొడగంటి నీదాసుండ నైతి నంటి
నీపంచ నిల్లుగట్టుకొంటి సంపంగిమన్నా
చేపట్టి యేలుకోవయ్యా ॥
నేఁడు నాకోర్కె లీడేరె నేఁడు నావెతలు దీరె
నేఁడు నాకు శుభములుఁ జేరె సంపంగిమన్నా
నిన్నుఁ జూడఁగంటి ॥
పరమపావనుఁడనైతి పరమవైష్ణవుఁడనైతి
పరమపుణ్యుఁడనైతి నేను సంపంగిమన్నా
కరుణించి నన్నేలు కోవయ్యా ॥

వ॥ ఇవ్విధంబున నీలవర్ణుని వర్ణించి విప్రనారాయణుండు పర్ణశాలఁ
బ్రవేశించెనట యెటువలెను.

దరువు ॥ ఘంటారవం ॥ అట.

చలువచీరపాణిచారుజాతిమీరఁగఁ గట్టి
తిలకము చిత్రించి నామతిరుమణి దిద్ది
విలసిల్లుకీలుగంటు వీపుపై నటియింప
జలజాక్షి కొత్తమసానియై వచ్చె ॥

వ॥ ఇవ్విధంబున నమ్మౌనిపాలికి వచ్చి భావికుచార్పణ సూచకంబుగా జంబీరఫలంబులు కానుక లిచ్చి యతనిచరణారవిందంబులకు వందనంబు లాచరించెనట యెటువలెను.

"శ్రీమతే రామానుజాయ నమః, భగవద్భాగవతాచార్యకృపాభివృద్ధిరస్తు" అని యేమనుచున్నాడు.

చూర్ణిక॥ హేతరుణి! కిమేతదత్రాగమనం? కిమావాసస్థానమ్? కిం భవదీయం నామధేయం? కాషాయాంశుకాదివిశేషవేషధారణం కిం కారణం? కిమేతావృశదీనతయా? మయా యాదవశశాంకకింకరేణ తవ కింకరణీయం? తావకీనం కథయ వృత్తాంతమఖిలమ్.

వ॥ అనిన దేవదేవి యామహానుభావుని జూచియేమనుచున్నది.

చూర్ణిక॥ ఆకర్ణయ మౌనిజనవరేణ్య! దేవదేవీనామ్న్యహం, దేవదాసీలోభాదిదుర్గుణసమేతాం మాతరం విహాయ వైరాగ్యేణ సమాగత్య భవద్దివ్యసందర్శనం (లబ్ధ్వా) స్వామినాం చరణారవిందసేవాం కరోమి, కరుణాకటాక్షవీక్షణేన పరిరక్షణం కర్తవ్యమ్.

వ॥ అని మఱియు నేమనుచున్నది.

పదం॥ కాంభోది.

గాసామునకు మిమ్ము వేసరించమయ్యా, బాపనయ్యా,
ఇలు రోసివచ్చినదాని కాసుద్దులికనేల, బాపనయ్యా.
కులమేమి పొలమేమి కూటికి వెరవేమి. బాపనయ్యా, నీ

నెలువెల్ల బంగారునిగ్గులు దేరేని, బాపనయ్యా,
ఎలదోటపనికి నిన్నెవ్వారు బంచిరి బాపనయ్యా,
మాతోఁ బలికితె ముత్యాలు పగడాలు చిందేనా, బాపనయ్యా,
చెమటలు వడియంగ జేతులు జడియంగ, బాపనయ్యా,
కమలాకరములకు కాల్వలు దీర్చేను, బాపనయ్యా,
కౌమరుపాయమెల్లఁ గొల్లఁబోనిత్తురా, బాపనయ్యా, నీ
సముఖాన కొత్తమసానియై యుండేను, బాపనయ్యా,
ఊరేమి పేరేమి యున్నచందమేమి, బాపనయ్యా, యింత
గారవించి నన్ను గడకంటఁ జూడవు, బాపనయ్యా,
చేరి నీపాదాల సేవసేసే నని, బాపనయ్యా, చాల
కోరి నిన్ను చాలకొలువ వచ్చితి నయ్య, బాపనయ్యా ॥

వ॥ అనిన నప్రతిమహరిభక్తిపారాయణుండగు విప్రనారాయణుఁ డామాటలు విని యేమనుచున్నాఁడు.

పదం ॥ కాంభోది ॥ ఆట.

పదివేది దివ్యప్రబంధము మాకు
నైఁపదు సంసారబంధము,
ఎద నుండు హరిభక్తిగంధము,
యోగీంద్రులతోనె సంబంధము ॥భామా॥

పల్లవి

మాతో మీకేటిమాటలు విన
వాడిగాదు మీపాటలు ॥భామా॥
భవనంబులు పర్ణశాలలు మా
పాటలు హరిమీఁదియేలాలు
తగిలియుందురు ముక్తిబాలలు మా
దాహరములు హరిలీలలు ॥భామా॥ మాతో ॥

మేమున్న యూరు శ్రీద్వారక ముక్తి
కాముని పైనె మాకోరిక
స్వామిభక్తి మాకుచేరిక, ఓ
కోమలి! నీవిక నూరకపోవె ॥ భామామాతో ॥ 3

ఆబుబిడ్డలపొందుఁ గోరము, మేము గోరేది
హరిభక్తిసారము
నీలవర్ణుని గొల్చువారము మీ
యాలాపములు విననేరము ॥ భామా మాతో ॥ 4

పరమాన్నములు కాయగూరలు మా
పరిధానములు నారచీరలు
సరిపోవు మీకు మామేరలు మా
సంగడికాండ్రు పకీరులు ॥ భామా, మాతో ॥ 5

వ॥ అని తనసంగతి నంగీకరింపని వైష్ణవపుంగవుని బహుభంగులఁ బ్రార్థించి యాకలికిచిలుకలకొలికి పసులు సేయ సమకట్టి పయ్యెద జారఁగట్టి వెరవరి గనుక చొరవకుఁ జొచ్చి యాపరమవైష్ణవునిఁ జేరి పాలకుద్దాలంబుఁ దిగిచి కేలం గీలించి పాదులకు నీరు పారించు పాటునికి సహకారిణియై గనిమలు దీర్చుచుఁ గాల్వలు దార్చుచు మడవలు మార్చుచు వేరువెల్లంకులు నటికివైచుచుఁ బూరిమొలకలు పెటికివైచుచు కంపలు నాటుచు వెంపర మీటుచు వనమండలసహచారిణియై చనుకొండలపొంగున నడుము గడగడ వణఁక నెమ్మోమునెత్తమ్మిపైఁ జెమటలు గ్రమ్మ నాయాసంబున కోర్చి యతనిచిత్తంబురా నడువ నేర్చి చలువలు విసర్జించి షడ్రసాన్నంబులు వర్జించి పరిమళంబులఁ గోరక యనిశంబును నిద్రవేగింపుచు నతని మనస్సు లాగింపుచు నీరీతి దినచర్యలు నడుపుచు దినంబులు గడుపుచు నుండియుండి వేసరి

యాదాసరిపాఱుని గరఁగింపవెరవుఁగానక నాసరివారిలోఁ బ్రతిసఁ బూని యవజ్ఞ దెచ్చుకొంటిగా యని కంటికొలుకుల నీరుజార నాసారంగలోచన రాజగోపాలస్వామిని దూరుకొనెనట యెట్లు వలెను.

పదం॥ ఘంటారవం॥ అట॥

ఘోరపుఱుని జేరి పొడగన్నదానను, రాజమన్నా, ఆ
మేరతోనె యిట్టు చేరవద్దన్నాడె, రాజమన్నా,
ఏటికి నీయెలదోటకు వచ్చితి రాజమన్నా, నే
నేటికి నితఁడున్నచోటికి వచ్చితి రాజమన్నా,
మొక్కలిబాపని సొక్కించే నని రాజమన్నా, మా
యక్కతోఁ బంతము లాడుకొంటి నేల రాజమన్నా,
విరులు గాననైతి విడెము గాననైతి రాజమన్నా,
నిరతముఁ గంటికి నిదురఁ గాననైతి రాజమన్నా.
మొగము జూడడు నాముచ్చటఁ దీర్పడు రాజమన్నా, నన్ను
మగువా రమ్మని యొక్కమంచిమాటాడడు రాజమన్నా,
సరకు సేయడు వీఁడు చిత్రాతివిధమున రాజమన్నా, వీని
గరఁగింపఁ జాల నాగర్వ మింతకు వచ్చె రాజమన్నా,
ఏమి సేతు నాకెవ్వారు దిక్కయ్య రాజమన్నా, నీవు
నామాట చెల్లించి నన్ను గావవయ్య రాజమన్నా ॥

వ॥ అని యాకన్నులకలికి వెన్నునకు విన్నవించి తోటపనుల బడలి యొకచోట నిద్రింప నాభద్రగజయాన కలలోన వచ్చి సుభద్రా సోదరుండీరేయి కోరిక చేరికలయ్యెడు నని గారవింప నాచంపక గంధి దిగ్గన మేలుకాంచి కాంచనచేలానుగ్రహంబునకు హర్షించి యొక్కయశ్వత్థంబుక్రింద నాశ్వసించియున్న నారేయి మహా వర్షంబు గురిసెనట యెటువలెను.

కం॥ శంపాలతలు నటింపఁగ
తుంపరలై చినుకు లగుచుఁ దోరణలగుచున్
చంపకగంధి చలింపఁగ
సంపాజాలంపువాన లప్పుడు గురిసెన్ ॥

వ॥ అమ్మహావర్షంబుచేతఁ దడిసి జడిసి నడురేయి నానిడువాలుఁగంటి యాతపసిముక్కంటియున్నకారాలయింటిచాయకు వచ్చి యేమనుచున్నది.

కాంభోది॥ ఆది॥

ఏమయ్య చోటియ్యరాదా, ఓ స్వామి
నామీఁద నీకు దయలేదా, వానచే
నా మేను ముద్దాయె నడురేయి పొద్దాయె ॥ ఏమయ్య ॥

నమ్మి వచ్చినదాన గానా నీపాదముల
నమ్మి వచ్చినదాన గానా, అయ్యయ్యో నన్ను
రమ్మని పిలువ వింతైన, నాపై వాన
చిమ్మసగోవులు చిమ్మినట్ల గురిసేని ॥ ఏమయ్య ॥

ఒకమూల నొదిగియుండేనయ్యా, నీపర్ణశాల
నొకమూల నొదిగియుండేనయ్యా, అయ్యయ్యో నీ
వొకమాఱు పలుక వేమయ్యా, నేనొంటిగ
నొకరాము నింకెందు నుండఁగలను గోవింద ॥ ఏమయ్య ॥

వ॥ ఇవ్విధంబున నాజవ్వని యవ్వనిమధ్యంబున నలజడిచేఁ జేరి చోటిమ్మని మాటిమాటికిఁ బ్రార్థింప నాతీర్థపాదుండు తనశిష్యుని చేతఁ దలుపుఁ దెఱపించి యాబింబాధరకు జంబుగూడ నిప్పించి యేమనుచున్నాఁడు.

పదం॥ కురంజి॥ రూపకం

పావనివౌదువు భక్తురాలవౌదువు
భావింప నీ వెంతపరిశుద్ధవైనా
నావద్దకు రారాదు నడురేయిప్రొద్దున
శ్రీవైష్ణవులు గేలిసేయరా నన్ను ॥ పావని ॥

జడివాన వెలిసెను సన్నచినుకులాయె, నీ
గుడిసెపంచనుండు గడసేపుదాఁక,
పడతులు వద్దనున్న భక్తి యించుకఁ దలఁచు
నడవడి దప్పును నారీమణిపల్ల
జడధారు లేయూరు జన్మనులేయూరు
పడుచ యెన్నడు లేనిపలుకు లేమిటికే ॥ పావని ॥

మగువ చెంగట నున్న మౌనమించుకఁ దలఁచు
మగువలతోఁ బొత్తు మౌనికిఁ దగదు
పగటివేళల మాతో భాషింతువుగాని
చిగురుబోణి యీరేయి చేర రావద్దు ॥ పావని ॥

వ॥ అని పలికి మఱియు నాఖింబోష్ఠి నిష్ఠురోక్తులు బలుకు నామాటలకు మోమాటబూని యామౌని తనకడనున్నశిష్యుని జూచి యేమనుచు చున్నాఁడు.

పదం ॥ యమునకులకాంభోజి ॥

విప్ర:— జడివానచే నొగిలి చలిచేత నీరేయి
అడచి పడుచున్నాది యలినీలవేణి,

శిష్యు:— విడువక మిము పేర వేమారుఁ జీరుచుఁ
బడుచున్నది లేదంటి పరమయోగీంద్ర ॥

సావేరి

విప్ర:— ముమ్మరమై వాన ముసురుబట్టియున్నది
కొమ్మను లోనికి రమ్మందమటర,

శిష్య:— రమ్మంటె వద్దనరాదుగా యాచార్య, యీ
కొమ్మచన్నులకు మీరొమ్మందమౌన,

విప్ర:— చలిచేత నిప్పుడు చాతానిపడుచుకు
నిలువెల్లఁ బులకించి వలిపట్టె నటర,

శిష్య:— భళి భళిరె మిమ్ము ఫాలాక్షుగదిమిన
వలిపట్టె దాని వలిపట్టు లేదు

విప్ర:— అరమర సేసితే యపచారము రాదా
తరుణి వాసుదేవదాసురాలు గాదా,

శిష్య:— హరి హరి మొదలింటి రెండక్షరములు
పరిహరింపవయ్య పరమయోగీంద్ర.

విప్ర:— మమ మాయచున్నాది మనసందుకు రమ్మని
రమణిని బిలవర రామానుజులు.

శిష్య:— మమతతో దేవరమన సందుకు మొగ్గితే
రమణిని మీవద్దకు రమ్మనే నయ్యా ॥

వ॥ అని యాధూర్తశిష్యుండు కొన్ని వార్తలాడి వెడలిపోయే నట యెటువలెను.

వ॥ ఆ సమయంబున నామోహనాంగి పర్ణశాలచెంగటకుసుంగంబులో దాఁచిన చలువచీరఁ గట్టి గట్టికమ్మిపయ్యెద చెఱఁగు మెఱుఁగు గుబ్బలపై సవరించి తగినసొమ్ములు ధరియించి యతని యనుజ్ఞ వడసి గుడిసెలోఁ బ్రవేశించి తడిసినకురులు విదలించునెపంబున

నుదుటుగుబ్బలయుబ్బు గనుపించ నలమట పలుకులు వినుపించి యడుగులకడఁ జేరి యేమనుచున్నది.

పదం॥ ముఖారి॥ ఆది॥

పల్లవి

నెటికలు దీసేనయ్యా నీతొడలు
నే వడివేసేనయ్యా,
కటకట నాతో ముచ్చటలాడితే నేమి
యిటువంటివైరాగ్య మిఁక నేటికయ్యా ॥ ॥ నెటిక ॥

ఆచార్య నీవు నన్నలముకోవయ్యా
మీచిత్త మూర మెలఁగేనయ్యా ॥ 1

పైటచే విసరేనయ్యా నేను నీ
మాటలు కొసరేనయ్యా,
ఆఁటది యుసురంటే అది నీకుఁ గోరగాదు
నేటికైన మీవద్దఁ జోటియ్య వయ్యా ॥ 2

పాదము లొత్తేనయ్యా తావిపువ్వొడి
పదనుసేసి మెత్తేనయ్యా,
సేదఁదీర కొంతసేవ సేయించుకొని
నీదాసురాలిఁ గూడి నిదురబోవయ్యా ॥ 3

వ॥ అని తన మాయను లోనుపరచి గానపరిచయంబున మేనుమఱచిన యమ్మహాభాగవతుని మనసు లాగించి భోగించి రేయెల్ల వేగించి యతఁడు తనవలలకు జిక్కుట నెఱింగి యేమనుచున్నది.

దేవదేవి:— ఓపరమయోగీంద్రా మాయక్క తనుజూడఁ బిలువ నంపినది. ఊరిదాక పోయివచ్చేనయ్యా,

విప్ర:— ఓవాలుగంటి నీజంటఁ బాసి యొంటినే నుండనేర్తునా నీవెంట వచ్చేనే.

దేవదేవి:— అయితే విచ్చేయవయ్యా, అని తనయింటికి నమ్మహా భాగవతుని సాగించుకొని వచ్చేక్రమ మెటువలెను.

దరువు॥ కలవాణి॥

అల ఋశ్యశృంగుని నతివలు దెచ్చినట్లు
వలపించె నాయింతి వైష్ణవోత్తముని ॥

వ॥ ఇవ్విధంబున విప్రనారాయణునిఁ దోడితెచ్చి యాదేవదేవి తమ యక్కకు పందె మొప్పగించి యేమనుచున్నది.

పదం॥ మధ్యమావతి॥ అటతాళం॥

చెల్లి:— పందెముఁ జెల్లె గదే, ఓ యక్క పందెముఁ జెల్లె గదే,

అక్క:— పీని కందుమాటల కరగించినపుడె నీ పందెముఁజెల్లెనె బంగారు చెల్లె ॥ 1

చెల్లి:— వలపించరాదంటివే, ఓయక్క వలపించరాదంటివే,

అక్క:— ఆ పెలరాజునైనను వలపించ నేర్తువే, చెలియ కలియుగ రంభవు కావా నీవు ॥ 2

చెల్లి:— నీచిత్తము వచ్చునా, ఓ యక్క నీచిత్తము వచ్చునా,

అక్క:— నీచెల్వుఁ జూచిన నిలుపున కరగరె ఓచెల్లె భూసుర ఖేచరులైనా ॥ 3

వ॥ ఇవ్విధంబున కాంతారత్నంబు కొంతకాలమాపరమోపశాంతునిఁ గంతునిమాయల సొక్కించి రతిశ్రాంతుని జేయుచున్న కూతురి చాతురికిఁ దాళలేక దానితల్లి యల్లునిపై దాడివచ్చెనట యెటువలెను.

దరువు॥ ముఖారి॥

పటపట పండ్లు గొఱుకుచు
నెటికలు విఱచి తిట్టుచు
విటకంటికి వచ్చె నా విప్రునికడకు ॥

వ॥ ఈరీతిఁ చాఱునిపై నలుకఁబూని వచ్చిన ముదిమేనిసాని
దొరసాని తనలో దానేమనుచున్నది.

పదం॥ శంకరా భరణం॥

సుద్దులనే జోకొట్టి
వద్దివారివాకట్టి
వద్దనున్న చిన్నదాని
వలలోఁ బెట్టినందుకు
బుద్ధిచెప్పకమాన వానికిఁ దగిన
బుద్ధిచెప్పక మాన ॥

పల్లవి ॥

అపకార మాయె నందరిలో వాని
నే దూరుసేయక మాన ॥ 1

బెల్లించి వేడుకొని నా
బిడ్డను గూడుకొని
నెల్లాంళ్ళనుండి యింట
నెలకొన్నందుకు వాని
వెళ్ల నంపక మాన, వానితోటకే
మళ్ల నంపక మాన ॥ 2

చుట్టాల రానీక
సొమ్ములు దే నీక, నా

పట్టిని జేఁబట్టి
భ్రమయించినందుకు
పట్టితియ్యక మాన, ధోవతికొంగు
పట్టి తియ్యక మాన, జందెముఁ జుట్టి
పట్టితియ్యక మాన ॥ ॥ 3 ॥

వ॥ ఇవ్విధంబునఁ బంతంబులు పలికి యావృద్ధవారకాంత యాశుద్ధాంతఃకరణునిచెంతఁ జేరి యేమనుచున్నది.

ద్విపద॥ రాటోటుబాఁపనదాసరి నీవు
తోటపనుల్ సేసి తొడు నెల్ల మాని
ఓరి ! మాయింటి కెందుండి వచ్చితివి
యారకె నాబిడ్డయోజలుఁ జెలఁది
మొగలాయవాఁడవై మోహపుట్టించి
పగలును రేయిని బానువు దిగవు
యేమందుఁ బెట్టితో యేమి సేసితివో
నాముద్దుపట్టి నీసటనలఁ దగిలి
పిలిచిన పలుకదు పిలువ దెవ్వరిని
నిలుదూర నిచ్చి నిన్నెదఁ బాయ దిపుడు
సుఖతెలుఁగదు గదా గుల్లకానైన
నెలుకవే నీవల్ల నేమి ఫలంబు
జవ్వాది దెచ్చేవా సరితేనిజాజి
పువ్వులు దెచ్చేవా పునుగు దెచ్చేవా
చీరలు దెచ్చేవా సిగ్గైన లేక
తేరకుఁ దేరగా నొకతెరాటంబు
తలకు మందెక్కించి దయను సొక్కించి
వలను జిక్కించి జవ్వనము లెక్కించి

చెల్లెలిమాటలు చెవిఁ బెట్టకుండ
తల్లిమాటలు సమ్మతములు గాకుండ
రాజాధిరాజులు రమ్మని పిలువఁ
బూజలు సేయంగఁ బొగడొందుదాని
మటుమాయకాఁడవై మరులు పుట్టించి
కటకట ! ఓరి ! నాకన్నకూఁతురిని
వేవేలభంగుల వెకలి సేసితివి
నీవొక బాఁపడవేమిరా వోరి !
తిరుమణి యేమి నీ తిరుచూర్ణ మేమి
కరమున శంఖచక్రంబు లివేమి
దాసరితన మేమి తావడా లేమి
నీసరివారెల్ల నినుఁ జూచి నవ్వ
జడియక రామణసన్యాసి వగుచుఁ
నడచుచున్నావు వైష్ణవుఁడవా నీవు
పరునిసొమ్ములు దీసి బరిగంట సేసి
మరులు పుట్టించేది మాజాతివిద్య
మాయిల్లు జేకొని మాసొమ్ముఁ దినుచు
మాయల మందుల మమ్ము సొక్కించి
కటకటా ! దినములు గడుపుచున్నాఁడ
వెటువంటిజగజంత వేమందు నిన్ను
వేసరితి మీయిల్లు వెడలి పోకున్న
దాసరివాఁడ నే దండింతు నిన్ను.

వ॥ అనిన విప్రనారాయణుండేమనుచున్నాఁడు.

"ఓయత్త ! యిటువంటి మాటలాడెదవు, ధవళోర్ధ్వపుండ్ర ధారణంబు మాకసాధారణంబు, పరమమాయావాదిభంజనంబు

మాకు దివ్యాంజనంబు, ఈప్రపంచంబు విష్ణుమాయ యని యెఱుంగుదుము గాని తక్కినమాయ లెఱుంగము, మందులంటివి గదా యవి మందులకుఁ గాని మాకుఁజెల్లునా, మావంటివారు మీ యిల్లుఁ జేరుట హరిప్రేరణంబని తెలిసికొందురు గాని యీలాగందురా!" అని యాదినారాయణపారాయణుండగు విప్రనారాయణుండు విష్ణుమాయావివశుండైనకారణంబున దాని దారుణవచనంబులు సైరించి యాసలు వీడుకోనోపక వేఁడుకొనుచున్నాఁడట యెటువలెను.

పదం॥ ముఖారి॥ అటతాళం॥

విప్ర:— అత్త నేనేమి సేతునాకు వేరు
విత్తి పైతి గదవె.

వే॥ కం॥ రిణజిత్తులు మాని, ఓరి యింద్ర
జిత్తా వెడలి పోరా॥

విప్ర:— వేమకొనెగాని ఓయత్త నా
గోడు బోసుకోకవే

వే॥ కం॥ ఓరి బోడిదాసరి యీ
బూటకములు మాని పో పోరా నీవు॥ 2

విప్ర:— నీకాళ్ళకు మ్రొక్కెనే ఓయత్త
నాపైఁ గోపము మానవే

వే॥ కం॥ నాకూతురి విడిచి పొయ్యేవో
లేక చీకాకయ్యేవో॥ 3

వ॥ అని వేఁడుకొన్నను వినక యానిష్ఠాగరిష్ఠునిపై నిష్ఠురోక్తులు నడిపించి కూతురుకీలువిడిపించి తనయిల్లుగడిపించిన నతండు

బయలుదేరి యా నారీమణితలవాకిటిపంచఁ జేరి సన్నిధి దూరి యేమనుచున్నాఁడు.

పదం॥ ఆహరి॥ ఆది॥

మోముఁ జూతునా, ఆమోహనాంగి
మోముఁజూతునా, ఇంకొకసారి
మోముఁజూతునా, దానికి స
రాము చేతునా, ఏమనిదూరుదు
దైవమిట్లు పగ సేసెగా ॥

ప ద ము ॥

పాయక మే మిద్దరము
పాలు నీరు వలె నుండ
మాయదారి ముసలిది
మమ్ము నెడబాపెగా ॥ 1

జక్కవ వలివెలుఁగువలె
జవ్వని నేనుండగా
రక్కసియై ముసలిది
రచ్చకు నను దెచ్చెగా ॥ 2
భరతపు పిట్టలవలె
భామ నేను కూడుండగా
కరికరియై ముసలిది
కలయిక నెడబాపెగా ॥ మోము ॥

వ॥ అని వృద్ధగణికను దూరి యాపరిశుద్ధుండు మదనమాయాబద్ధుండై తనకన్నులఁ గట్టినయట్లున్న దేవిదేవి నుద్దేశించి యేమనుచున్నాఁడు.

॥ దరువు ॥

బడలికతోఁ బోఁటపను తెల్లఁ దీర్చి నే
పర్ణశాలఁ బోనుండఁగా;
అడిమన్నై తినని అడుగులొత్తేనని
అడుపపతో వచ్చి నన్నుఁజేరి,
బడిబడిసుద్దుల బుజ్జగించి యొక్క
గడిసేపు నీపునాకడ నుండి
యెడఁబాయలేసని యెలయించుకొని వచ్చి
యింతకుఁ దెచ్చితి వో పడుచా ॥

పల్లవి ॥

మోసపోతి గదవే నాబుద్ధికి
మోసమాయె గదవే,
మోసపోతి నన్ను నాసరివారిలో
దోసకారి కాన నీసుద్దులు విని ॥ మోసపోతిగదవే ॥

వ॥ అని యాపరమవిరక్తుఁ డనురక్తుండై యాపంచసుండి పొంచి పొంచి చూచి తదీయజనని యొకపనినెపంబున పరాకైనచో నవకాశంబుఁ గల్పించుకొని యా వాలుగంటిపడకయింటివాకిలిఁ జేర వచ్చి యేమనుచున్నాఁడు.

పదం॥ సౌరాష్ట్రి॥ ఆది॥

విప్ర:— గారవించి తలుపుగడియఁ దీయవే నీ
కౌఁగిటిచాయకు వచ్చేనే
నారీమణి నిన్ను నమ్మి వచ్చిన, విప్ర
నారాయణుండనే నేను ॥ 1

దేవదేవి:— ముమ్మాటికి రాజగోపాలపదములు
నమ్మిన నమ్మికఁ జాలించి, ఓరీ
మమ్ము నమ్మితినని మందలింతురా
మంచివైష్ణవుండ వౌదువయ్యా ॥ 2

విప్ర:— పరమయోగీంద్రుఁడ గానా, నాతో
పంత మేటికే వో కొమ్మా

దేవదేవి:— పరమయోగీంద్రుఁడ వైతే బోగము
పడుచులయింటికి వత్తురా ॥ 3

విప్ర:— ద్రావిడవేదము చదివినవాఁడనే
ధవళాక్షి నీవు నన్నేలవే,

దేవదేవి:— ద్రావిడవేదము చదివినవారు, కం
దర్పునివేదము విందురా ॥ 4

విప్ర:— అంగన, మన్నారుతళిగప్రసాదమైన
పొంగలి చవిగొన్నవాఁడనే,

దేవదేవి:— పొంగలిచవిగొన్నవానికి సతివల
యెంగిలి దిన మనసాయెనా ॥ 5

విప్ర:— ఆరామకైంకర్య మాచరించి, మ
న్నారును గొలిచినవాఁడనే,

దేవదేవి:— ఆరామకైంకర్య మాచరించువాని
కీరామకైంకర్యమేలయా ॥ 6

విప్ర:—చెలువ మన్నారుపాదతులసీ
దళములుశిరసున ధరియించువాఁడనే.

దేవదేవి:— తులసీదళములు ధరియించువానికి
దొలుతటిముడుపువ్వేలయా ॥ 7

విప్ర:— మన్నారుశ్రీపాదరేణువు దెచ్చి, యేపొద్దు
మైనిండ నలందేవాఁడనే,
దేవదేవి:— మన్నారుపాదరేణువు లలందేవానికి
మాచంటిపసుపునిగ్గులేలయా ॥ 8

విప్ర:— మన్నారుపాదములు మౌళిపై సోఁకఁగ
మాటికి మ్రొక్కేవాఁడనే,
దేవదేవి:— మన్నారుపాదముల మాటికి మ్రొక్కేవాఁడవు
మాకాళ్లకు మొక్కనేలయా ॥ 9

విప్ర:— మన్నారుశ్రీముద్ర మైఁగల్గువాఁడనే
మగువ నన్నీవేళ మన్నించవే,
దేవదేవి:— మన్నారుశ్రీముద్ర మైఁగల్గువానికి
మాచన్నులముద్రలేలయా ॥ 10

విప్ర:— బాహుమూలములఁ జక్రరేఖలు గల్గి
భాసిల్లువాఁడనే నేను
దేవదేవి:— బాహుమూలములందుఁ జక్రరేఖలు గల్గ
పడుచులనఖరేఖలేలయా ॥ 11

విప్ర:— రాజమన్నారుకుమారండనే నేను
రతిని నీవు నన్నేలుకోవే ॥
దేవదేవి:— రాజమన్నారుకుమారుఁడవైతే
రసికుండ మాకు మారుండగావే ॥ 12

వ॥ అని మఱియు నేమనుచున్నాఁడు.

పదం ॥ శంకరాభరణం ॥ ఆది ॥

పాలించవే నీ పంచదారమోవి
తేలించవే నన్ను దేవదేవి ॥ పాలించవే ॥

దాసరితనమునకుఁ దక్కువైనఁ గాని
నా సరివారెల్ల నగినా నగని
నీసరసకు రాక నే దాళలేనే
మాసామి యెంబెరుమానారుతోడు ॥ పాలించవే ॥

హరిదాసు లిప్పుడేమన్నా యననీ
పురవాసు లెడబాసి పోయినా పోనీ
తరుణీమణి నీకు దక్కితి సొక్కితి
తిరువామణితోడె తిరుమణితోడె ॥ పాలించవే ॥

కులధర్మమునకు నే వెలితైన గానీ
తెలిసి మానుషులు తెగడిన తెగడని
చెలిమితో నినుఁ జూడ లే నుండలేనె
పులినీలవేణి మా యాళ్వారుతోడె ॥ పాలించవే ॥

వ॥ అని మదనవేదనాదోధూయమానసుండై యిట్టి ముసలిదానికలికి బైటిపంచఁజేరి నిద్రాహారంబులు లేక యాభద్రగజయాన సంగతికై రాజగోపాలస్వామిని బ్రార్థించెనది యెటులనెను.

పదం॥ ఆహరి॥ ఆది॥

మీసామిపై దేనె యంట
రాసితిగా సంసారము రాజమన్నా
నీసేవ చేసుకొంటెఁ
నెమ్మది నుంటిఁగా రాజమన్నా ॥ 1

ఆశ పుట్టించి నన్నేల
తోసుకోవచ్చితయ్య రాజమన్నా
నాసరివారిలో నింత
నగుబాటుసేతువా రాజమన్నా ॥ 2

నమ్మి నీపాదాలు గొల్చు
నాయము జాలించి రాజమన్నా, యీ
కొమ్మసుద్దులకే సొక్కి
నట్టుబో నాడుకొంటిరా రాజమన్నా ॥ 3
కమ్మఁదమ్మి వీడి నే
గాసాము బోనాడుకొంటిరా రాజమన్నా,
ఉమ్మెత్త పూవుఁ జేరిన
తుమ్మెద నైతిగా నేను రాజమన్నా ॥ 4
కోరిన కోరికలిచ్చే
పారిజాతముఁ జేరి రాజమన్నా,
నారాబమున నొక్క
గవ్వపూస నడిగినట్లు రాజమన్నా ॥ 5
ఆరాధించువారికెల్ల
నపవర్గ మిచ్చేనిన్ను రాజమన్నా,
ఈనీరజముఖిపొందు
నిమ్మని వేఁడుకొందు రాజమన్నా ॥ 6

వ॥ అని యాబిత్తరిపై హత్తిన చిత్తంబు మఱలింపనేరక సారె సారెకు దనుఁ దూరుచున్నభూసురకుమారుని తెలంగెఱింగి దయాంతరంగితాంగుఁడైన రాజగోపాలస్వామి యప్పుడు నటురూపంబు వహించి విజయరాఘవభూపాలుండర్పించిన పంచపాత్రలలో మించుబంగరుగిన్నెఁ గొంచు నమ్మించుబోటి యింటికి వచ్చెనట యెటువలెను.

॥ దరువు ॥

నటుఁడై వచ్చెను లోకనటుఁ డావేళ, ఆ
మటు మాయలాడియున్న మందిరమ్మునకు ॥

వ॥ ఈ విధంబునవచ్చిన మాయాబ్రహ్మచారిని జూచి యావృద్ధ వారవధూటి యేమనుచున్నది. ఓరి! బాపనచిన్నవాఁడా నిన్ను చూస్తే మనస్సు చల్లనాయెను. నిన్నెవరంపిరి? సరిపొద్దుకాన మేఁటికి? వస్తివిరా అబ్బడు, అనిన నతండేమనుచున్నాఁడు.

వ్యుఁ॥ మానినీమణి! కృష్ణమధుర మాసీమ
మౌనులచెంగట మరఁగి యేనుందు
తల్లిదండ్రులు నన్నదమ్ములు లేరు
కల్లకాదమ్మ యేకాంగిని నేను,
కొన్నాళ్లు నేఁ గౌశికునివద్దఁజేరి
కొన్ని విద్యలు నేర్చుకొని యుంటినమ్మ
తెరప కొన్నాళ్లు సాందీపునివద్ద
పరిచర్యఁ జేసితి బాల్యంబునందు
బహుకాలపరిచితబ్రహ్మచర్యమున
రహికెక్కినాఁడ శ్రీద్వారకయందు
సరనుతుఁడగు విప్రనారాయణుండు
వరకుసుమాంజలివాసనల్ గలుగ
నన్ను శిష్యునిగాఁగ నడుపుచున్నాఁడు
అన్నిట నాతని కాప్తుండనేను
ప్రతి యెందు లేని యీ బంగారుగిన్నె
సతివ! మీకిచ్చిరమ్మని నన్నుఁబంచె
నీ గిన్నెగైకొని యిటు చేరఁదీసి
మాగురువుల నేఁడు మన్నింపవమ్మ॥

వ॥ అని పొసంగఁ బల్కి యొసంగిన బంగరుగిన్నెఁ జేకొని యావృద్ధాంగన వటుపుంగవుని జూచి యేమనుచున్నది.

ద్విపద:— ముడుపులకేమి సొమ్ములనంగ నెంత
గడనల కేమిరూకలకేమి కొదవ
సెలవు చేసేదెంత చేకొనేదెంత
తెలనాకులకునెంత దినవెచ్చమెంత
పరిమళంబులకెంత బాగాలకెంత
పరదేశికులకెంత పైసెలవెంత
విద్యాధికులకెంత విప్రులకెంత
వైద్యులకెంత దైవజ్ఞులకెంత
ప్రతిదినంబును వచ్చు బంగారమునకు
మితి మేర గలదె మేవలెనన్న
పారుండ ! కోటికిఁ బడగ నెత్తించి
గారవంబున గంటఁ గట్టంగరాదె
అకట బంగరు గిన్నె..........
..............గాదుగదా విచారింప
ముదిమది తప్పి నే మొక్కలి నగుచు
మవరినఁ దనవన్నె వాసి గోల్పడెను
ఆలప్పులెంచి తానలిగి పోఁ దగునె
కూతురప్పటినుండి కూమక్కఁబట్టి
నిట్టూర్పు పుచ్చుచు నిద్దురబోమ
పట్టను పీణె చేబట్టము చెలియ
తనకు నాబిడ్డపై దయగలదేని
తాను మేల్పడిన చంద మెఱింగెనేని
యుల్లంబులోఁ గోపముపసంహరించి
యల్లుని వేగ రమ్మని పిల్వవయ్య ॥

వ॥ మఱియు నా కయ్యాల ముసలిగయ్యాళియతనినలనాటిబలియజ్ఞవాటి బ్రహ్మచారి యని విచారింపక వంచించి యేమని పలుకుచున్నది.

అని యా మాయలాడి పలికిన గాయకముమాటల కాయనాదిపటుపు నవ్వుచు విప్రనారాయణుండున్న చాయకు వచ్చి బంగరుగిన్నె నొసంగినప్రసంగంబెఱింగించక "నిన్ను దేవదేవి వెదకుచున్నది లోనికి ర" మ్మని వీనుల విందుగా నుందలించెనట యెటువలెను.

"నిన్ను దేవదేవి వెదకుచున్నది. లోనికిఁ బోవయ్యా" అను సమయంబున భూసురాగ్రేసరుండమృతంబు జిలుకు నతని పలుకు లాలించి యేమనుచున్నాఁడు.

విప్రనారాయణునిమాట:— "నీవెవరయ్యా, నా పాలిటి గోపాలస్వామివా తెలుపవయ్యా" అని దిగ్గున లేచి లోని కరుగుసమయంబున నవ్వాటు వంతర్హితుండయ్యెనట యెటువలెను.

ఆలో నొకరిపట్ల పదుండై తదీయపరిచారకులు పిలువ దాని నెలవున కరిగి తజ్జననియపచారంబులు సహింప మని యుపచారంబులుఁ జేయ నాచాయనున్న దేవదేవిని జూచి యేమనుచున్నాఁడు.

పదం॥ శంకరాభరణం॥ ఆది॥

అయ్యొయ్యొ నిన్ను నమ్మవచ్చునా
యిట్లైతే దైవము మెచ్చునా
నీయందమెఱుఁగలేనైతిగా నేను
నిన్నునమ్మి మోసపోతిగా 1

బాసలిచ్చి తప్ప నంటివి నా
భావమెల్లఁ జూరకొంటివి
ఆసఁ జూపి వద్దనుంటివి యింత
హోసమేల కట్టుకొంటివి 2

బెల్లించి యెడబాయనంటివి యట్టి
తల్లిమాట లేల వింటివి
తెల్లని వల్లా పాలౌనా యిట్టి
కల్లాడి మేలు మేలౌనా 3
వలపు నన్నింత సేయగా నా
వన్నె వాసి కోలుపోయె గా
తలిరు విల్తుఁడు పగదాయగా
వ్రతముదప్పి సుఖము లేదాయగా ॥ 4

వ॥ అని దూరిపల్కు పల్కుల కన్నీరజలోచన కన్నులు గోలు మీటుచు లేనివిచారంబుఁ బూని యామానేంద్రునితో నే మను చున్నది.

పదం॥ భైరవి॥ అట॥

చీని చక్కెరైనా నా నోటికిఁజేఁదురా
కల్ల గాదురా
నేనేమి సేతురా నీవురాకుంటే కంటికి
నిద్దుర రాదురా (పల్లవి)
తాళరాదా నన్ను జూచి తాళరాదా
కోప మొక్కవేళ రాదా, ఓరీ యేలరా
అల్గ నేలరా పాయజాలరా, నేను 1
మరులుకొన్న దానితో
మాటికియే వాదురా
యెఱుఁగనివా రేమన్నా
యింత లేదురా 2
పెద్దాపెసుద్దుల కలుగవద్దురా, ఓరీ
మాకిందరి కినుకైతే యేమి కద్దురా ॥ 3

వ॥ అని గుబ్బలాడి దబ్బరవగపుమాటలాడి యుబ్బుకవణంబులు మేపుచు, బిబ్బోకంబులు సూపుచు నతని జోడుఁగూడి నటియించె నట యెటువలెను.

దరువు॥ సామరాగం॥ రూపకం॥

వేడుక మీరంగా విప్రనారాయణుని
జోడుగూడి దేవదేవి సొంపు నటియించె.

వ॥ ఇవ్విధంబున నప్రతిమ హరిభక్తిపారాయణుండైన విప్రనారాయణుండును శీవిమీర దేవదేవియును ప్రోడలై జోడుగూడి నటియించిన నొక్క నెరజక్కపు గుబ్బెత వారలఁ జూచి నేమపుమీర నేమని పలికెను.

పదం॥ సౌరాష్ట్రి॥ అట॥

అలుకలు దీరెనటె మీయిద్దటి
యలుకలు దీరెనటె,
పలుకుగుబ్బలగుమితు లున్నవి
అలుకలు దీరెనటె ॥

వ॥ అనిన నారేయి వధూకులమనోరథ పరంపరలు నెరవేరిన, మరునాడరుణోదయంబున స్నానసంధ్యాదివిధులాచరించి రామానుజ నంబి రాజగోపాలస్వామి సన్నిధికి వచ్చెనట యెటువలెను.

దరువు॥ భైరవి॥ అట॥

ప్రేమతో కోవిలబీగముద్రలు దీయించి
రామానుజనంబి వచ్చె రాజగోపాలుని కడకు ॥

వ॥ ఇవ్విధంబున నర్చకులర్చామంటపంబుఁ జేరి జయవిజయులకు నమస్కరించి సన్నిధిఁజేరి తిరుకాపులుతీసిన క్రమంబెటువలెను.

ఈరీతి నర్చకులు పరిశుద్ధాంతఃకరణులై భూశుద్ధి పూర్వకంబుగా సన్నిధిని గూర్చుండి యన్యావృశంబైన పుణ్యాహవాచనంబొనర్చి తిరువారాధనకు సంకల్పించి రట యెటువలెను.

సంకల్పం:— శుభే శోభనే ముహూర్తే ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్వర్తమానే వ్యావహారికే చాంద్రమానేన నందననామసంవత్సరే ఆయనే శుభమాసే శుభనక్షత్రే శుభయోగే శుభకరణే ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ చంపకారణ్యపుణ్యక్షేత్రే శ్రీరాజగోపాల స్వామిసన్నిధౌ విజయరాఘవభూపాలస్య సర్వాభీష్టసిద్ధ్యర్థం శ్రీరాజగోపాలస్వామిపూజాం కరిష్యే, తదాదౌ కలశపూజాం కరిష్యే, అంకుశముద్రాయాం సూర్యమండలతీర్థాకర్షణం కరోమి, అస్మిన్ దివ్యమంగళవిగ్రహే శ్రీరాజగోపాలస్వామి నమావాహయామి, ఆసనం సమర్పయామి, అర్ఘ్యం సమర్పయామి, పాద్యం సమర్పయామి, మధుపర్కం సమర్పయామి.

పూజారి:— ఓహోహో! యిదెన్నడా! యిదెన్నడా!! పంచపాత్రంగళిలే వారు పొన్ను కిణ్ణియై వాడోం, మోసం వందుదే, అడ కూరత్తాళ్వారే!

కూరత్తాళ్వార్:— అడియేన్.

పూ:— అడ యెంబెరుమాన్!

ఎంబెరుమాన్:— అడియేన్,

పూ:— అడ పరాంకుశా!

పరాంకుశన్:— అడియేన్,

పూ:— సన్నిధియిసే వారు పొన్నుకిణ్ణం యేశా కాణోం, యిదెన్న పిళ్లాయి ?

పరాంకుశం:— ఇదెన్న మయ్యా ! నమ్మై కేళ్కుర్రీర్, నాంగళెల్లాం దేవరీర్ పిరషు అన్నో వందోం.

పూ:— ఆనాల్ యిందైక్కు పంచపాత్రంగళ్ శుద్ధిపణ్ణినవరార్ ?

పిళ్లాయి:— ఉమ్మై త్తవిర నాంగళెన్న తిరుక్కాప్పుపూట్టు వాంగినోమో కిణ్ణంగళై తొట్టోమో, నమ్మై కేళ్ప్పానేశా, యిందైక్కు పుమ్మడయ పరిశై యంద్రో.

పూ:— ఆమాం, అప్పడిశొల్లుం పిళ్లాయి, సమ్మడయమేదానే శొమత్తినేర్గళ్, ఆనాల్ పుంగళై కేళ్క కార్యమెన్న, యిన్నైరత్తిర్కు తిరువారాధనం సంక్షేపమాకప్పణ్ణువోం. స్నపయామి, వస్త్రగంధమాల్యధూపదీపనైవేద్యతాంబూల నీరాజనాదిషోడశోపచారైః పూజయామి, ఇని యెళుందిరుం పిళ్లాయి.

అని తిరువారాధన సంక్షేపముగా నడిపించి యర్చకులు బయలుదేరిరట యెటువలెను.

ఆసమయంబున దేవాలయపాలకుండు ప్రాతస్స్నానవిధు లాచరించి జియ్యంగార్లు ఏకాంగులు వెంట రాఁగా ముద్రాదండ ధౌరేయుండై కోవిలకువచ్చెనట యెటువలెను.

దరువు ॥ బిలహరి ॥

కోవిల తొరవారు కూడి తను గొలువంగ
కోవిల యధికారి గొబ్బున వచ్చె ॥

వ॥ ఇవ్విధంబున వచ్చినయధికారి విజయరాఘవభూపాలకల్పిత సహస్రస్తంభమంటపంబున నేవిధానఁ గూర్చుండెను.

ఆసమయంబున నధికారి సమ్ముఖంబునకు నంబులువచ్చే క్రమం బెటువలెను.

పదము॥ ఆహరి॥

పోవచ్చునా దేవదేవునిసొమ్ము
రావచ్చునా ముచ్చు కోవిలకు ॥

తారయ్యయ్యో తలారులు లేరా
వైరావులు జీపము దాఁచువారా
వోరచేసుకొ జియ్యలుందేది మేరా
పోరామియైన నంబులమీఁదిదూరా ॥ 1

తిరముగానన్నిధిఁ దిరిగేము మేము
తెరతరములనిందకు తాళలేము
హరిహరి మేము తస్కరులము గాము, యీ
తొరనున్న యపుడె కైదువమీఁదిసాము ॥ 2

ఈరామానుజనంబి యితఁడేఁటిపెద్ద
పారుపత్యగానివల్ల బయిలుగావద్ద,
ఔరౌర యింత యన్యాయముగద్దా
పోరాడి దిగమింగు పొంగలిముద్ద ॥ 3

వ॥ ఈవిధంబున వచ్చినయర్చకులు పారుపత్యగాణ్ణి పొగడే క్రమం బెటువలెను.

పూ:— శ్రీరాజగోపాలస్వామికటాక్షసిద్ధిరస్తు,
హేమాబ్జనాయికాకరుణాకటాక్షసిద్ధిరస్తు.

అధికారి:— కూర్చుండరయ్యా నంబులారా.

వ॥ అవురా యీరీతివచ్చిననంబులకు నమస్కరించి అధికారి యేమను చున్నాఁడు.

అధి:— రారయ్యా, నంబులారా, పూజాద్రవ్యాలెల్లా వచ్చేనా? రాగ బోగాలవారెల్లా కాచుకొన్నారా? తిరువారాధన సాంగముగా నడచేనా?

నంబులు:— దేవరీర్ పారుపత్యత్తిలే సకలము న్నడక్కురదు.

వ॥ అని నంబులు తమలోఁ దామేమనుచున్నారు.

నంబులు:— రామానుజదీక్షితరే! విణ్ణప్పం శెయ్యుమయ్యా!

రామా:— నీరుదాన్ విణ్ణప్పం శెయ్యుమయ్యా!

అధికారి:— యారు శొన్నాలెన్న శొల్లుంగో,

నంబులు:— యెంగళుక్కు వుడంబు నడుంగుదే, యెన్నవెన్రు శొల్లపోఱోం, స్వామిసన్నిధియిలే పంచపాత్రంగళిలే పొను పొన్నుకిణ్ణియె కాణోమయ్యా!

అధికారి:— భళా! భళా! మంచి నంబులౌదురు. అన్నిన్ని పరామర్శించేము గాని సన్నిధికి పోయిచూడండి.

అధికారి:— రారా వోరీ! వద్దిమనుష్యుఁడా!

వద్ది:— అయ్యయ్యా!

అధికారి:— తలవరుల పిలువరా!

వద్ది:— రారోయి! తలవరులారా! పారుపత్యకాఁడు పిలుస్తున్నాఁడు.

వ॥ అని కోవిలయధికారి పిలువనంప నెలవరులైన తలవరులు వచ్చే క్రమమెటువలెను.

జతి॥ సారంగ॥

ఘల్లు ఘల్లు మన కంచు
కట్ల గుదియలఁ బూని
బలునీలికాశలు
బవిరిగడ్డములు

విలసిల్ల నీలలు వేయుచు
వెంబడివచ్చిరి
తలవరు లధికారి
కొలువు కూటమునకు ॥

వ॥ ఇవ్విధంబున వచ్చినతలవరులు తమ తమ సాధనముఠువుల మెరవడి గనుపించే క్రమ మెటువలెను.

జతి॥ దరువు॥

ఇవ్విధంబున చేరినతలవరులు
వింతవింత హరువులసాధన మురుపులు
గనుపించ దమలో దామేమనుచున్నారు
అరవపదాలమాటలు నడిపించి
వెంబడినే తలారులు పారుపత్యకానిదగ్గరకు వచ్చి ॥

తలా:— సామి ! దండం.

వ॥ ఈరీతి మొక్కి నిలిచిన తలవరులతో నధికారి యేమనుచున్నాడు
రారా ! అడ్డాదుడ్డీ ! రారా ! మొట్టెయాండి ! రారా ! ఆకాశవెట్టి !
రారా ! కుత్తాచ్చి ! రారా ! చోళంగిదేవ ! రారా ! అనధారి !
రారా ! శమ్మందాండాళ్ ! రారా ! తుంబుచ్చిరాయా ! రారా !
చెరువకారపల్లవరాయా !

తలార్లు:— సామి ! సామి !

అధికారి:— కోవిలలో సన్నిధినియుండే గిన్నె పోయినది. నాలుగు ఘడియలలో గిన్నెను తెచ్చి వొప్పగిస్తే వొప్పగిస్తిరి, లేకున్న ట్లాయనా నాపారుపత్య మెఱుఁగుదురె.

తలార్లు:— సామి ! సామి ! కిణ్ణి యెప్పో పోచ్చి ?

అధికారి:— ఈ రాత్రి పోయిందిరా.

తలార్లు:— అదు వెంగల కిణ్ణియో ?

అధికారి:— బంగారు గిన్నెరా వోరీ !

తలార్లు:— అందకిణ్ణి యెత్తిని వుందు ?

అధికారి:— నీ కెంత కలిగితే యేం ? తెచ్చి వొప్పగించరా.

తలార్లు:— ఆనాల్ నంబియారే ! అంశత్తారై యెంగళ్కై క్కో వొప్పివిచ్చాల్ కళవు యిన్నేరమే అరువిత్తు వొప్పవిక్కురోం.

అధికారి:— నీకు యెవరిమీఁద సందేహము కద్దో వారినెల్లా పరామర్శించుకొని గిన్నె వొప్పగించురా, వోరీ !

అధికారి:— వద్దివానితో చెప్పేది:- రారా ! ఓరీ ! నంబులను తెలపటల వశం వొప్పగించరా, పోండ తలారులు.

అడ అడ్డాదుడ్డి ! నీ వా డా అందణ్ణామఫై నాథ కోవిలండై యిలె మెత్త పొల్లాదవాళ్ కండాయి. అవాళ్మడత్తు పట్టా పోయి అడిపాత్తు వాడా. అంద శేకొండనై నార్ కోవిల్ మట్టాపోయి అడి పాత్తువాడా. అడ ! చోళంగిదేవా ! నీ వాడా. పాంబణియిలే కళవు అహప్పడుం సందేహమిల్లె విచారిచ్చు వాడా, పోంగో, అడ ! నంబియారె ! రానత్తారె ! వారుంగో, అడ ! రామానుజదీక్షితా ! వారుంగాణుం.

రామానుజదీక్షితులు:— ఏండా ! తంబి ! మెత్త పుద్దండమాయ్ పేశురాయి.

అధికారి:— అడ ! వందువరాయదీక్షితా ! నీర్ వారుం.

వందువరాయణ:— ఏం పిళ్లాయ్ ! కోవిచ్చుకొళ్ళురాయి.

అధికారి:— అడ ! శంబుకరాయ ! వారుంగాణుం.

శంబుకరాయర్:— ఎన్న త్తుక్కు అళక్కురాయ్, పిళ్ళాయ్ అప్పా !

అధికారి:— అడ ! శండలంగారనంబి ! వారుంగాణుం.

శండ:— ఇదెన్న పారుపత్యం దాయప్పచ్చి ?

అధికారి:— అప్పచ్చియో, కోవింప్పచ్చి తిణ్ణాప్పోలే కిణ్ణియుం మిశుంగురో మెణ్ణుం యిరుక్కురాయో, కోవిల్ పరిప్పట్టం ఎడుత్తుకొండుపోయి అంద పడక్కు తెరువితే కొడుత్తాయే. ఉన్ మగన్ అంద పొన్ను బొమ్మయై కొండుపోయి శళపళిచ్చానే అత్తినేయుం అత్తినేయుం ఇన్నైక్కు వెళియాకవేణుం. సన్నిధికిణ్ణి వుంగళై త్తవిరపోప్పెమో, కట్టి కట్టి వురిక్కవేణుమో కిణ్ణి వొప్పివిక్కురీళో.

శండ:— అడ అప్పచ్చినాపరియోపదా. సూరుతలపళై యాయ్ యిరుక్కురోమె. ఎణ్ణెక్కానాలుం యిందప్పావముండో, స్వామి శుక్కకషాయం అముదు శైదు కోవిల్ తిరుక్కాప్పు శాత్తికొండు పరమట్టుం యిరుందదు, అదర్కు పిరకు అంద పన్నారుక్కే తెరియుం, నీంగళ్ వేండియదు శెయ్యుంగళ్.

వ॥ ఆసమయంబున నడుగులెత్తబోయిన తలవరులలో నొక్క యాంధ్రభటుండు మరలివచ్చి యధికారికి నేమని విన్నవింపుచున్నాఁడు.

తలారి:— సామీ ! యీతూరుపు తేరిదాంక హలకులిశరేఖలు గలిగిన యడుగులజాడ కన్పించుచున్నది గాని మానుసులు నడిచిన యడుగులు కానరాదయ్యా !

అధికారి:— అటువంటి యడుగులు గోపాలునికిని విజయరాఘవ భూపాలునికే గాని యితరులకు లేదు గదరా ! చోరునియడుగు లెత్తమంటె నవనీతచోరునియడుగులున్ను యతనికుమారుని యడుగులున్ను కంటి నంటా వచ్చేవు. మాకన్న నీవే భాగ్యశాలివిరా !

వ॥ అని పలికి యధికారి నిరాకులచిత్తుఁడై తలవరులఁ జూచి విచ్చలవిడిగా కోవిలలో గిన్నె ముచ్చిలించిన యాహెచ్చు పాటచ్చరుల బహువిధంబుల శోధించి సాధించి పట్టి తెప్పించి యొప్పింపు మనిన నా తలవరు లాలాగే యొప్పి యున్న సమయంబున దేవదేవియింటిదాసి వడిగ గుడిప్రసాదంబునకునై వెడలి వచ్చెనట యెటువలెను.

దరువు॥ కేదారిపంతు॥ అటతాళం॥

మురువుగ నేలికసానిముడిచినవిరులు జుట్టి
కురిమోపుచీరగట్టి గుడిదారిఁబట్టి
తిరిగి తిరిగి చూచుకొంచు దేవదేవియింటిదాసి
కొరమాలినసుద్దులు గొణుగుచు వచ్చె నపుడు.

వ॥ ఈవిధానవచ్చిన చంచలవాణితో మరొకతె యనేమాట:— ఒడి! అక్కా! ఎంగేపోరాయడి?" ఈవిధంబునవచ్చిన చంచలవాణి గుడిలోనియలబలంబుఁ జూచి తనకు మొగమెరికయైనయొక నంబితో నేమనుచున్నది.

దాసి:— అదెన్నయ్యా! నంబియారయ్యానే! కోవిల్వాశలిలే మెత్త ఆరవారమా యిరుక్కిరదు, శోరు కెలవశిక్కురాళో!

నంబి:— అడి పోడి!, కోవిల్లె కిణ్ణి పోయి అడిపిడియా యిరుక్కిర దెన్న, పుసక్కు శోరు కుడుక్క వందిరుక్కురాహో!

దాసి:— అదు యెన్నకిణ్ణి యయ్యా?

నంబి:— పొన్నుకిణ్ణి యడి.

దాసి:— అందకిణ్ణి యెమ్మాత్తిరం పుండయ్యా?

నంబి:— ఉనక్కు శొల్లావిట్టాలెన్న మెత్తకొరచ్చలాచ్చో, యెత్తినె యానాలెన్న పోడి.

దాసి:— శౌన్నాలెన్న నామెన్న యెడుత్తుక్కొండు పోరోమో ?

సంబి:— ఉన్నోడె శొల్లుకురదెన్న ? ఇన్నేరత్తిలే వునక్కు నంబియారు డనే పేచ్చెన్న పోడి.

దాసి:— ఓహోహో ! ఎన్నోడే సీ పేశలామో పిన్నె, ఎంగళ్ పీట్టుక్కు వరవాళుక్కుళ్లే నీ యెత్తినేయుండు, మహామహా పట్ట పెరియవా శెల్లాం యెంగక్కాళుక్కు వేణవాడమై యెల్లాం కొండువందు కొడుప్పార్గళే, అవర్గళై క్కాట్టిలుం నీ మెత్త పెరియవనో ?

సంబి:— అడీ ! ఏండి పాప్పారుకుడియెల్లాం కెడుక్కురాయ్, అప్పడి పునక్కు యారు కొండువందు కొడుత్తారడి ?

దాసి:— ఏన్, నేత్తురాత్రి విప్రనారాయణయ్యనెంగిర వొరు పెరియ పట్టనామక్కారపాప్పాన్ యెంగక్కాళుక్కు ఒరు పొన్నుకిణ్ణి కొండువందు కొడుత్తానే, పునక్కు యెన్న తెరియుం పోడా పేయిపాప్పానే.

వ॥ అనఁగా తలవరులు విని పారుపత్యకానిముందరకు నాదాసిని రప్పించినక్రమ మెట్లనెను.

దరువు ॥

ముచ్చుఁ దెచ్చెదనన్న మెచ్చులందెద వంటి
మచ్చకంటిఁ దెచ్చితిని మహిమచే నిపుడు ॥

వ॥ ఇవ్విధంబున దాసిని రప్పించి యామాటలు జెప్పించి దాని యేలికసానియిల్లుఁ జొచ్చి మేలుమంచపై దాఁచినగిన్నెఁ బుచ్చుకొని విప్రనారాయణసహితమైన దేవదేవినిఁ దెచ్చిరట యెట్లనెను.

దరువు॥ ఉసేని॥ ఆది॥

లలనామణిని యల విప్రనారాయణుని దెచ్చిరి
తలవరులు యధికారికొలువున కపుడు ॥

వ॥ అపుడు తనకూతును విడిచిపోఁ గాళ్లాడక వెంటనంటివచ్చు విట కంటకి యేమనుచున్నది.

పదం॥ ఘంటారవం॥ ఆది॥

కూతుర యెంతగౌరవము దెచ్చితివే
ప్రాతిమాలిన పేదబాఁపని గూడి ॥ ॥ పల్లవి ॥

తెరతెరకాఁడని తెలియఁజాలక నీ
వకట వీనికి లోనైతిగదవే ॥ 1

ఒడియక మనమెంత సడికి లోనైనాము
కడపట నొక్కఁగుల్లకాసైన లేదే ॥ 2

కోకలు దెచ్చెనో పైకము లిచ్చెనో
నీకు వీనిపై నట్లు నెనరు బుట్టెనే ॥ 3

గడన పుట్టదాయె గాపుర మిట్లాయె, యా
చెడుగుబాఁపని యట్లు చేరఁదీసితివే ॥ 4

రారాని నిందలు రావచ్చునా సరి
వారిలోన తలవంపాయె గదవే ॥ 5

వ॥ ఈరీతిఁ బట్టి తెచ్చినవారు నిజాచి గుడి పారుపత్యగాఁడు ఘూరమణుని వైష్ణవపక్షపాతమెఱింగి యతని శిక్షింప వెఱచి, దేవదేవి దొరయెఱింగిన బిరుదుపాత్ర గనుకఁ జెనకరాదని నిశ్చయించి నిచుళాధిపతి సమ్ముఖమ్మున నుంచి యతండు నియమించినట్లు నడిపించెదనని యెంచి వారిని దోడుకొని పోయి

రాజస్థానంబునకు వచ్చురాకకు మున్నుగా నన్నరపతి యంతః పురసంచారులచేతఁ దద్వృత్తాంతంబు విన్నవాఁడై కొలువై యుండెనట యెటువలెను. ఇవ్విధంబున నాస్థానమండపంబునఁ గొలువై యున్న భూరమణునిసముఖంబునకు నా దేవ దేవి ని భూదేవశిఖామణినిఁదోడుకొని దేవాలయపాలకుండు వచ్చెనట యెటువలెను.

దరువు॥ సావేరి॥

శ్రీవైష్ణవుని దేవదేవిని దాఁ దోడుకొని
కోవిలయధికారి రాజుకొలువుకు వచ్చె ॥

వ॥ ఇవ్విధంబునఁ బట్టి తెచ్చిన వైష్ణవపట్టభద్రునిఁ జూచి యాచోళ సామ్రాజ్యసింహాసనపట్టభద్రుం డేమనుచున్నాఁడు.

రాజువాక్యం:— చోళభూసురరత్నంబ ! రేఫళకారంబులకు భేదంబు లే దనుప్రవాదంబు నీపేరనే వెలయించితివి, మంచివాఁడ వౌదువయ్యా.

అని వ్యంగభంగి చెలంగంబలికి యాభూరమణుండు వైష్ణవాపచారభీరువై యా నా రా య ణా ను గ్ర హ పా త్రు నిఁ జూచి యేమనుచున్నాఁడు.

ద్విపద:— పరమవైష్ణవుఁడవు పరతత్త్వవేది
వెరుగవా నీచర్య నిది యేమి నీకు
శ్రీరాజగోపాలు సేవింపుచుందు
వారామకైంకర్య మాచరింపుదువు
నీవంటివానికి నీచసాంగత్య
మేవిధంబున వచ్చె నెఱిఁగింపవయ్య
నింద రావచ్చునే నీవంటివాని
కిందుకేమనవచ్చు నిది యీశ్వరాజ్ఞ ॥

వ॥ అని పలుకుపలుకులు విని కన్నుగొనల బాష్పబిందుసందోహంబు చిందిన వదనారవిందంబు వాంచి యావిరించికులభూషణుండు భాషింపకున్న నా విన్నపాటుఁ జూచి యాచోళభూపాలుండు మఱియు నేమియన మనసురాక నారాకాచంద్రముఖినిఁ జూచి వెఱవకు మని భయంబు వారించి, కలతెఱంగెఱింగించిన మరల నంపించెదనని బరవసంబుగాఁ బలికిన నాచిలుకలకొలికి పులుకుపులుకునఁ జూచుచుఁ గాటుకకన్నీరు గోట మీటుచు నేమనుచున్నది.

సీ॥ మేదినీనాయక మీకొల్వు సేసి నే
వెడలిపోవుచునుండువేళ నొక్క-
యెలదోఁటలో నిల్చి యితని నక్కడఁ గాంచి
పదరి మాయక్కతోఁ బంతగించి
యింటికి జడదారి నెలయించుకొని వచ్చి
కొన్నాళ్లు నే జోడుఁగూడి యుండి
......................మౌనీంద్రునకుఁ జేత
విడిముడి............వీడనాడె

గీ॥ నాతగులుఁ బాయఁజాలక నాటిరేయి
నాతఁ డీగిన్నె శిష్యునిచేత నంపె
నెందు లాగించి తెచ్చెనో నే నెఱుంగ
మీరె తెల్పుఁడు నేర మెవ్వారిదయ్య ॥

వ॥ అని యన్నీలవేణి విన్నవించిన నాఁ గాదననేరక యమ్మహాభాగవతునిపైఁ దెంపుగా పారుపత్యంబు నడిపింపఁ గూడక యేయర్థంబిదమిత్థంబని నిర్ణయింప సమర్థుండు గాక భూపాలుం డాందోళితహృదయుండై యున్నసమయంబున నందఱిసందియంబులఁ దీర్ప నవ్విప్రనారాయణునకు సకలాభీష్టమునుఁ జేగూర్ప

సుత్సహించి భక్తవాత్సల్యనిధియైన రాజగోపాలస్వామి విహంగపుంగవతురంగారూఢుండై కురంగట సాక్షాత్కరించెనట యెటువలెను.

జతి॥ సౌరాష్ట్రి॥ ఆది॥

బంగారురెక్కలపక్కెరసామ్రాణి నెక్కి
యంగజగురుండు వచ్చె, నతఁడున్నకడకు ॥

—: ఇక్కడ విన్నపం చదివేది :—

రుక్మిణీప్రాణవల్లభ! ద్రౌపద్యభిమానరక్షక! గజేంద్రవరద! అహల్యాశాపవిమోచన! కాళియఫణిఫణారంగనాట్యలీలావినోద! విశాలవక్షస్థల! కౌస్తుభాభరణ! నీలమేఘశ్యామ! పద్మాక్ష! నీదయ నాయందుంచి నన్ను రక్షింపవే! సహజగుణసంపన్న! సంపంగిమన్నా!!

వ॥ ఇవ్విధంబున సాక్షాత్కరించినపుండరీకాక్షుని చరణారవిందంబులకు (ముదంబునఁగరంబులుమోడ్చి) విప్రనారాయణుండు ప్రాకృత వచనంబులఁ బ్రస్తుతించె నట యెటువలెను.

స్తోత్రము॥ జయ రాజగోపాల! జయ దయాశీల!
జయ శేషఫణితల్ప! జయ నిర్వికల్ప!
జయ భక్తమందార! జయ నిర్వికార!
జయ పుండరీకాక్ష! జయ సురాధ్యక్ష!
జయ శార్ఙ్గకోదండ! జయ జగత్కాండ!
జయ రమాహృదయేశ! జయ చిత్ప్రకాశ!
జయ జయ ఘనవర్ణ! జయ జగత్పూర్ణ!
జయ చక్రధౌరేయ! జయ జగద్గేయ!
జయ విహంగతురంగ! జయ కృపాపాంగ!
జయ దేవమూర్ధన్య! జయ జగన్మాన్య!

సాక్షాత్కరించి మీ చనువుఁ బాలించి
రక్షింపు మము చాల రాజగోపాల !

వ॥ అని కొనియాడిన భక్తాగ్రేసరునకు భక్తాంఘ్రిరేణునామంబును పరమకల్యాణధామంబును పాలించి యానీలవర్ణుండు హస్త మస్తకసంయోగ మాచరించెనట యెటువలెను.

ఈరీతి భక్తునిగారవించి యాచక్రహస్తుండు భూచక్రేశ్వరుని జూచి యేమనుచున్నాఁడు.

రావోయి ! వత్స ! మదీయాంతరంగభక్తుండైన యీ విప్రనారాయణుండు సనకాదులకన్న మాకుఁ జనవరి గనుక నితనికిఁ దైత్రిలోక్యసామ్రాజ్యమే యొసంగియున్నారము. ఈబంగరుగిన్నె యనఁగా నెంత. ఈయుపచారయోగ్యునిపట్ల నపచారపడకనైరణఁ బూనితివిగనుక నీవు మాదయకుఁ బాత్రుండవైతివి. మాకుమారుండిచ్చిన బంగరుగిన్నె నాపెకు మరలనిచ్చి నీవు హెచ్చున నుండుమా !

వ॥ ఆసమయంబున శతానందపురందరాదిబృందారకు లత్యంతంబును సత్యాకళత్రుండైన భక్తవత్సలునిపై విచిత్రవుష్పవృష్టి గురియించిరట యెటువలెను.

అప్పుడు దివ్యదుందుభిఘోషపురస్సరంబుగా రంభాదికాంతలు నటియించిరట యెటువలెను.

॥ మన్నారుదేవికి మంగళమ్ ॥

శ్రీరుక్మిణీసత్యభామాసమేతశ్రీరాజగోపాలాయ మంగళమ్ ॥

హరిభక్తవిప్రనారాయణచరిత్రంబు సంపూర్ణము ॥

॥ శ్రీకృష్ణార్పణమస్తు ॥

# అనుబంధము.

శంకరాభరణము ॥ అట

మున్నీట మన్నిన దేవిని, చాల
మూర్తీభవించిన తావిని
మన్నారు పట్టపుదేవిని, నే
మదిలో భావింతు శ్రీవిని ॥ 1

పరువంపు మరువంపురెమ్మకు, మంచి
పదివన్నె బంగారుబొమ్మకు
మురవైరిముద్దులగుమ్మకు నే
మొక్కెను మాచెంగమమ్మకు ॥ 2

భావములో చింతదీరను నే
పరమానందంబు జేరను
సేవింతు నే సొంపుమీరను నా
శ్రీచెంగమలనాంచారును ॥ 3

రసదాళిసింగాణి వీరుని గన్న
రాధామోహనాకారుని
వసుదేవకూర్మి కుమారుని
వర్ణింతు చండలకారుని
విజయరాఘవనాయని యిల్లు
వెలసిన వేల్పులరాయని ॥ 4

## 2

శ్రీరాజగోపాలశౌరిని
శిశుపాలభూపాలవైరిని
పారిజాతాపహారిని
పాలించు లోకోపకారిని
భజియింతు భక్తుల పాయని
పరమదయాధౌరేయుని ॥ 5

॥ దరువు ॥

నారీమదనవిలాసుండు వాఁడు
సన్నేలు మన్నారుదాసుండు,
వీరులలోనెల్ల వీరుండు మా
విజయరాఘవధీరుండు ॥ 1

రాజులగెల్చిన శూరుండు వాఁడు
రాజమన్నారుకుమారుఁడు
రాజితశుభచారిత్రుఁడు వాఁడు
రక్తాబ్జవల్లిపుత్రుండు ॥ 2

చక్రహస్తునిసాటి సముండు వాఁడు
జగదేకమోహనాకారుండు
విక్రమార్కావతారుండు మా
విజయరాఘవధీరుండు ॥ 3

రతిరాజమోహనాకారుండు వాఁడు
రఘునాథవిభుని కుమారుండు
వితరణకర్ణావతారుండు మా
విజయరాఘవధీరుండు ॥ 4

.... .... .... .... .... ....

................నివో చెలియ

మన్నారుడాసుని కన్నులపండువుగ జూచితినె 1

వీరాధివీరుని వోచెలియ విభవదేవేంద్రుని

శ్రీరఘునాథ కుమార శేఖరుని 2

జతి॥ దరు॥ కాంభోది.

పంజులకమ్మలు బటువు వుంగరము (ము)రుగు

ముంజేతి కంకణము ముద్దులు గులుకంగ

మంజులధ్వని తాళగతుల మట్టుగాగ

చిత్తమురంజిల్ల నాడెను రాజగోపాలస్వామి పరాకు !

తాహత్తం నా॥ తగణం తైత్తై తైయ్య తాతా॥

సంతసాన నన్ను జూచు యిట్లా మన్నా-సరసప్రసన్నా.

కాంభోది॥ రూపకం॥

సన్న చేసి నేదేలరావురా సంపంగిమన్న మొక్కేరా

కన్నులనె మొక్కి నన్ను నీకన్యరమ్మని బిలిచి

సన్నజాజివిరులశయ్యకుఁ జేయిఁ జూపి

వన్నెకాఁడ యిట్లావలపు మరులుఁగొల్పి

రిగగమప॥ స్సనిపామగరిస॥ నినినిధధప

మపమగమగరిస॥ సన్న 1

గోరింట పొదచెంతనూ పూవులుఁ గోయుచు నేనాడంగ

చేరువనున్నట్టి చెలుల యేమరించి

గో(రం)ట నాచంట గురుతుగాఁ జీరి 2

పండువెన్నెలబైట పంతులు బాడుచునే నాడంగ
ఖండచెక్కరమోవి గట్టిచేయుమని
నిండువేడుకమీర నీమోవిఁ గదలించి 3

చెలికత్తియలుఁగూడి రతనాలచెట్టు నే గౌరింపగా
చెలువుమీరంగ వచ్చి చేబంతి అటుజూపి
పలుకు గుబ్బలఁజూచి పలుపుచు నవ్వుచు 4



రత్న ప్రెస్, తిరుపతి — 1950.